ఇలియిచ్ ఆ మర్నాడు పొద్దున్నే లేచి కొత్త మరిది, భార్యకు వద్దని ఎంత పోరినా వినిపించుకోకుండా, ఎల్లాగో అల్లాగ ఏదో ఒక ప్రభుత్వశాఖలో నెలకు అయిదువేలు వచ్చే ఉద్యోగం సంపాదించే ప్రయత్నంమీద పీటర్స్‌బర్గ్‌కు ప్రయాణమైనాడు అతని కిప్పుడు ఉద్యోగం ఎటువంటిదీ? అన్న ప్రశ్నే ఏమీ లేదు అది ఏ ప్రభుత్వశాఖ అయినా సరే రైల్వేలోగాని, బాంకులోగాని, చివరికి హోర్బ రులోగాని, ఎక్కడయినాసరే అతనికి కావలసిందల్లా అయిదువేల ఉద్యోగమే తన శాఖలో పైఅధికారులు తాను చేసినపని గుర్తించలేకపోయారు కనక ఆ ఉద్యోగం మాత్రం మరో మంత్రివర్గంలో దొరికితే చాలు! అతనికి కావలసినది అంతా అంతే

తలవని తలంపుగా ఈ ప్రయత్నంలో అతను పట్టిందల్లా బంగారం అయింది

కుర్స్కు స్టేషన్‌లో ఇలియిచ్ స్నేహితుడొకడు తటస్థపడ్డాడు ఇతడు ఇలియిచ్ కూర్చున్న ఫస్టు క్లాసులోకి వచ్చి కూర్చున్నాడు అతనిపేరు ఇలియిచ్ ఇద్దరు సంభాషణ ప్రారంభించిన తరువాత ఇలియిచ్ "ఇప్పుడిప్పుడే మంత్రివర్గంలో మార్పులను గురించి కుర్స్కు గవర్నరుకు టెలిగ్రాం వచ్చిం"దని చెప్పాడు ఈ టెలిగ్రాంవల్ల ఇవానోవిచ్‌ని తీసివేసి అతని స్థానంలో సెమినోవిచ్‌ని వేస్తారని తెలిసింది

దీనివల్ల రష్యాకు అదృష్టం ఏదారిపట్టినా, ఇలియిచ్‌కి మాత్రం బాగా లాభించింది దీనితో పీటర్ పెట్రోవిచ్, జఖార్ ఇవానోవిచ్ బాగా పెద్ద పదవుల్లోకి వెళ్లారు. వీరిద్దరిలోను జఖార్ ఇవానోవిచ్ ఇలియిచ్‌కి చాలా దగ్గర స్నేహితుడు, ఇంతకు పూర్వం ఇద్దరు ఒకే కోర్టులో కలిసి పనిచేశారు

మాస్కో వెళ్ళినతరవాత పై విషయాలన్నీ నిజమేనని ఋజువయింది పీటర్స్‌బర్గ్ వెళ్ళగానే ఇలియిచ్ జఖార్ ఇవానోవిచ్‌ని కలుసుకున్నాడు అతడు ఇలియిచ్ పనిచేస్తూన్న న్యాయశాఖలోనే అల్లాంటి ఉద్యోగం ఇస్తానని గట్టిగా హామీ ఇచ్చాడు

ఒకవారం గడిచిన తరువాత ఇలియిచ్ భార్యకు టెలిగ్రాం ఇచ్చా దానిలో 'జఖార్‌కి పెద్ద ఉద్యోగం అయింది ఒకవారం రోజుల్లో నాకు ఆర్డరు వస్తుంది ' అని వ్రాశాడు

ఈవిధంగా తలవని తలంపుగా మంత్రివర్గంలో మార్పులు రావడంవల్ల ఇలియిచ్‌కి తాను పనిచేసే న్యాయశాఖలోనే ఒక పెద్ద ఉద్యోగం అయింది. ఈ ఉద్యోగంలో అయిదు వేలకు తోడు, బదిలీ ఖర్చులకింద ఇంకో మూడువేలుకూడా వస్తాయి; ఇలియిచ్ ఇప్పుడు తనతోటి ఉద్యోగస్థు లందరికన్నా ఉన్నతస్థులు పైకి వెళ్ళాడు ఇంతకు పూర్వం తన డిపార్టుమెంటువాళ్ళు, ఆ అధికారులన్నా అతనికి మంటగా ఉండేదిగాని, ఇప్పుడది అంతా మాయమైపోయింది ఇలియిచ్ యిప్పుడు అన్ని విధాలా హాయిగా ఉన్నాడు

ఇదంతా జరిగిన తరవాత అతను మళ్ళీ స్వస్థానానికి చేరుకున్నాడు ఇలియిచ్ ఇప్పుడు దిగులుమాలినంత పోయి, సౌఖ్యము ఇదివరకెప్పుడు రుచిమాడి ఎరగడు ఈ కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత ఫెడరోవ్నా ధోరణి కూడా బాగా మారిపోయింది దంపతులిద్దరిమధ్యా కొంతవరకు సమాధ్య కుదిరింది. పీటర్స్‌బర్గ్‌లో ఇప్పుడుండరు ఇలియిచ్‌కి విందులు చేసేవారు అతని శత్రువు లందరికీ శృంగభంగం జరిగింది వారందరు ఇప్పుడతని చుట్టూ తిరగడం ప్రారంభించారు కొత్త ఉద్యోగం వచ్చిన తరవాత అందరు అతన్నిప్పుడు 'ఓహో ఓహో' అని గౌరవిస్తూ, "అదృష్టం అంటే అలాగ ఉండాలి" అని అంటూ లోలోపల అతని కింత ఉద్యోగం అయిందని అసూయపడుతున్నారు ఇలియిచ్ అంటే ఇప్పుడు పీటర్స్‌బర్గ్‌లో ఉన్న వారందరికీ బాగా అప్యాయత కలిగింది ఇలియిచ్ ఈ విసంగా వచ్చిన మార్పులన్నిటిని గురించీ అప్పుడప్పుడు తన స్నేహితులతో ప్రస్తావిస్తుండేవాడు.

ఫెడరోవ్నా ఈ మాటలన్నీ వింటూ అవన్నీ నిజమేనని నమ్మినట్టు కనబడేది ఏమీ అడ్డుమాటలు చెప్పకుండా తమ ప్రయాణం సరంజామా చేస్తూ ఉండేది ఇలియిచ్ ఇదంతా చూసి ఇన్నాళ్ళకు తన ప్రయత్నాలన్నీ దారిలో పడ్డాయనీ, భార్య కూడా ఇప్పుడు తనతో ఏకీభవిస్తున్నదనీ, కొంత కాలయించి ఇబ్బందులు పడుతున్నా ప్రస్తుతం అవన్నీ సర్దుకుపోతున్నాయనీ, ఇప్పుడిక తనజీవితం మర్యాదగాను, ఖులాసాగాను సాగిపోగలదనీ సంతోషపడ్డాడు

సెప్టెంబరు పదో తేదీనాటికి ఇవాన్ ఇలియిచ్ కొత్తఉద్యోగంలో చేరుకోవాలి అందుచేత ఒక పది రోజులపాటుండిపోవద్దునే ఉద్రేకంతో స్వస్థలానికి వచ్చాడు. అదీగాక క్రొత్తచోటికి కావలసిన సామానులన్నీ ఏర్పాటుచేసుకోవాలి; కుటుంబం అంతా ప్రయాణం కావడానికి తగిన సరంజాంకూడా చెయ్యాలి

ఇప్పుడు ఫెడరోవ్నా కూడా అతని తలలో నాలికలాగ మసులుతూంది. భార్యాభర్తలిద్దరు ఒక్కమాటమీద నడిచిపోతున్నారు.

అప్పుడుతనకొత్త తలపెట్టిన పనులు నిర్విఘ్నంగా సాగిపోతూండడంవల్ల భార్యాభర్తలిద్దరు చాలా అన్యోన్యంగా ఉంటున్నారు. వివాహం అయినతరువాత ఎప్పుడూ వారింత అన్యోన్యంగా మసులుకోలేదు. ఇలియిచ్ వెంటనే తన కుటుంబం అక్కడనుంచి తరలివెయ్యాలని అనుకున్నాడు గాని బావమరిదీ, అతని భార్యా, కాదు కూడదని పట్టు పట్టడంవల్ల మరి కొన్నాళ్ళపాటు అక్కడే ఉండిపోయాడు. వారి కుటుంబాని కిప్పుడీ కుటుంబంమీద వల్లమాలిన మమకారం ఏర్పడ్డది. చివరికి వారి బలవంతం మూలాన కుటుంబం అంతా బావమరిదిదగ్గరే అట్టేపెట్టి, ఆ కొత్తచోటికి అత నొక్కడే బయలుదేరి వెళ్లాడు.

పట్టినదంతా బంగారం కావడంవల్ల ఇలియిచ్ స్వతః చాలా ఉత్సాహంగా ఉన్నాడు. దానిమీద భార్యానుకూల్యం మరింత భరవసా ఇచ్చింది. దానా దీనా అతను లోలోపల ఉప్పొంగిపోతూ కొత్త ఉద్యోగంలో కుదురుకున్నాడు. అక్కడ అతనికి ఒక చక్కని భవంతి దొరికింది. భార్యాభర్త లిద్దరు చాలాకాలంనించి సరిగ్గా అలాంటి భవంతిలోనే ఉండాలని ఉవ్విళ్ళూరుతూ ఉండేవారు. అది చాలా విశాలమైన భవంతి. పెద్దమనుషులు కూర్చునే గదులు చాలా విశాలంగాను ఎత్తుగాను ఉన్నాయి. అదీగాక అవి పూర్వపద్ధతిలో కట్టిన గదులుకూడాను. ఆ భవంతిలో ఇలియిచ్ చదువుకోడానికి అన్ని విధాలా ఉపయోగమైన వేరే ప్రత్యేకమైన గది కూడా ఉన్నది. ఇదిగాక భార్యకు, కుమార్తెకు వేరే వేరే గదులు, కొడుకు చదువుకునే గది, చక్కగా అమర్చినట్లున్నాయి. కొడుకుగది ప్రత్యేకం అతని కోసం కట్టించినట్లే ఉంది. ఇలియిచ్ స్వయంగా దగ్గరఉండి, అక్కడ చెయ్యవలసిన ఏర్పాట్లన్నీ చేయించాడు. సోఫాలు మొదలైనవన్నీ ప్రాచీన పద్ధతుల్లో తయారుచేయించి తగినచోట్ల పెట్టించాడు. ప్రతిదీ సరిగా అతను తలపెట్టిన ఆదర్శపద్ధతిలోనే సాగిపోతున్నది. సగంసగం తయారైనవికూడా అనుకున్న దానికంటె ఇంకా ఎక్కువ బాగా ఉన్నట్లే కనిపించాయి. 'అవన్నీ పూర్తిఅయితే వీసమంతైనా పొటుదనం లేకుండా ఎంత సొగసుగా ఉంటాయి!' అని అనుకుంటూ ఇలియిచ్ లోలోపల మురిసిపోతూండేవాడు. పడుకున్న తరవాత, ఒకసారి భవంతిలో వెలుపలివారు కూర్చునే గది ఎంత సొగసుగా తయారవుతూందో ఊహించుకొని ఇలియిచ్ ఉత్సాహంగా ఉప్పొంగిపోయేవాడు. తరవాత ఆ గది అలంకరించే వస్తువులన్నీ అక్కడ ఉన్నట్లు భావించుకుని మురిసి ఆనందించాడు. తరవాత, తన భార్యకు కుమార్తెకు అవన్నీ అప్పజెప్పినా వారు కోరుకున్నట్లే ఉంటాయనీ, వారు కూడా పరమానందభరితులౌతారనీ అనుకుని ఎంతో సంతోషపడ్డాడు. కాని వారిద్దరూ కూడా ఆ గది అంత బ్రహ్మాండంగా ఉంటుందని అనుకొని ఉండరు. ఇలియిచ్ పురాతన వస్తువు లమ్మేచోటికి వెళ్లి మంచి ఖరీదైన వస్తువులన్నీ చవకబారుగా కొన్నాడు. అవి అలంకరించడం వల్లనే ఆభవంతికంతటికీ ఒక పెద్ద జమీందారీఛాయా వచ్చింది.

అయినా ఇంటికి వ్రాసిన ఉత్తరాలలో అతడా విషయం వ్రాయనేలేదు. హఠాత్తుగా అవన్నీ చూసి వారిద్దరూ ఆశ్చర్యపోవాలనీ, అందుచేత ముందుగా ఈ విషయం తెలియనివ్వకూడదనీ అతననుకున్నాడు. రాత్రింబవళ్ళువిధంగా కాలం గడిచిపోయింది. [illegible]పనీ అంటే అతనికి ఇష్టమున్నా, ఇప్పుడీ పని ముందది అంత ఉత్సాహంగా కనబడలేదు. ఒక్కొక్కప్పుడు కోర్టులో పని చేసేటప్పుడు కూడా తన గదిలో అమర్చే తెరలనుగురించి పరధ్యానంగా ఆలోచిస్తూ కూర్చునేవాడు. ఈ తోరణి ఎంతవరకు వెళ్ళిందంటే—ఒక్కొక్కప్పుడు ఇలియిచ్ స్వయంగా అక్కడ కుర్చీ ఇక్కడ, ఇక్కడ కుర్చీ అక్కడ సర్దుతూండేవాడు. ఒకసారి పనివాడొకడు గోడ పైభాగం మీద అలంకరిస్తున్నాడు. ఇలియిచ్ చెప్పిందతనికి బోధపడలేదు. అందుచేత నిచ్చెనపైకి కొన్ని మెట్లెక్కి వెళ్ళి, ఆ పనివాడికా విషయం తెలిసేటట్లు చెప్పాలనుకున్నాడు. కాని నిచ్చెన ఎక్కుతూంటే కాలు జారింది. అయితే మంచి సత్తా ఉన్న మనిషి కనక ఆ నిచ్చెన పట్టుకు వేళ్ళాడాడు. కాని అతని పార్శ్వం ఆ పక్కనున్న కిటికీ గడియకు గట్టిగా తీసుకుంది. మొట్టమొదట అది గీసుకుపోయినచోట బాగా బాధ పెట్టింది. కాని కాస్సేపటికా బాధ తగ్గిపోయింది. దానిమీద అతనికి మరింత ఉత్సాహం వచ్చింది. అటుపిమ్మట ఒక ఉత్తరంలో "నాకు మళ్ళీ 15 ఏళ్ళ వయసు ఉన్నంత ఉత్సాహం వచ్చింది" అని వ్రాశాడు. ఇలియిచ్ ఆ భవంతి ఏర్పాట్లన్నీ సెప్టెంబరు నాటికి పూర్తి అయిపోతాయని అనుకున్నాడు గాని, చివరికి అవన్నీ అక్టోబరు మధ్యదాకా జరిగాయి. అయితే పనులన్నీ పూర్తి అయ్యాక అతనే గాక చూసినవారందరు అవి చాలా బాగున్నాయని మెచ్చుకున్నారు.

నిజానికి ఇలియిచ్ చేసిన ఈ ఏర్పాట్లన్నీ సామాన్యసంసారులు తమకంటె కొంచెం ఉన్నవారిని అనుకరిస్తూ చేసే ఏర్పాట్లలాగే ఉన్నాయి గాని అంతకంటె ఏమీ విశేషంగా లేవు. సామాన్య సంసారులైనా ఇంచుమించుగా [illegible]

అనుకరించగలరుగాని అంతకంటె మించిపోలేరు గదా! ఇలియిచ్ సంపాదించిన ఆ కంచు విగ్రహాలు, ఆ రగ్గులు, ఆ పూలకుండీలు సరిగ్గా అలాగే ఉన్నాయి. ఇంతచేసినా అతని యిల్లు సామాన్యంగా అల్లాంటి తరహా మనుష్యుల ఇంటిలాగే ఉన్నదిగాని, అతనికి మాత్రం అదంతా ఒక పెద్ద బ్రహ్మాండమైన భవంతిలా కనబడింది ఆ వేళ భార్య, పిల్లలు బయలుదేరి స్టేషనుకు వస్తున్నారని తెలియగానే ఎంతో సంతోషపడి, ఇలియిచ్ వారిని కలుసుకోవడానికి అక్కడికి వెళ్ళాడు వారా యింటికి వచ్చేసరికి ఇల్లంతా పూల కుండీలతోను, కొత్తదీపాలతోను కలకలలాడుతూంది నలుగురు కూర్చునేగది, చదువుకునే గది మొదలైన వన్నీ చూసి కుటుంబం అంతా బ్రహ్మానంద భరితులైనారు ఇలియిచ్ వారికందరికీ [illegible] భవంతిలో ప్రత్యేకంగా చేసిన ప్రతీ ఏర్పాటు చూపించాడు, వారవన్నీ భట్రాజుల్లా పొగడుతూంటే ఎంతో ఆప్యాయంగా విని, పట్టరాని ఆనందం అనుభవించాడు సాయంత్రం వేళ అందరు కూర్చుని టీ పుచ్చుకుంటున్నప్పుడు ఫెడరోవ్నా అతనికి తగిలిన దెబ్బను గురించి అడిగింది కాని, ఇలియిచ్ అదంత పెద్దదెబ్బ కాదని నవ్వేసి, తానెంత చరచరా నిచ్చెన ఎక్కి వెళ్ళిందీ ప్రత్యక్షంగా వారికి చూపించాడు అటుతరవాత "నేను కొద్దో గొప్పో వస్తాదును కనక, అట్టే దెబ్బతగలకుండా తప్పించుకున్నాను కాని మరొకరయితే ఆ దెబ్బతో ప్రాణాలు పోవలసిందే ఏదో కొంచెం గీసుకుపోవడంతో సరిపోయింది ఇదిగో! ఇక్కడే కొంచెం దెబ్బతగిలింది ఇక్కడ ముట్టుకుంటే కొంచెం నొప్పిగా ఉంది అప్పుడే చాలావరకంతా తగ్గిపోయింది ఏదో కొంచెం బొప్పికట్టింది అంతే!" అన్నాడు.

వారందరు ఆ యింట్లో సర్దుకోవడం మొదలు పెట్టేసరికి సామాన్యంగా జరిగేటట్లు, మొత్తంమీద ఇంకొక చిన్నగది ఉంటే బాగా సరిపోయి ఉండునని అనిపించింది అయితే ఇప్పుడు అనుకున్న దానికంటె ఇంకొక అయిదువందలు ఎక్కువ వస్తున్నాయి ఈ మొత్తం ఎంత చిన్నదయినా ఇల్లాంటి మొత్తాలు చేతిలో పడ్డప్పుడు కలిగే ఆనందం చాలా గొప్పది

ఆ భవంతిలో అక్కడక్కడ చిన్న మార్పులు- అంటే ఆ సోఫా ఇక్కడికీ ఈ కుర్చీ అక్కడికీ జరపడంలాంటివి—ఇంకా జరుగుతూనే ఉండడం వల్ల, అన్నీ సజావుగా వెళ్ళిపోయాయి భార్యాభర్త లిద్దరికీ ఆ భవంతి అన్నివిధాలా వచ్చింది. అదీగాక వారిద్దరు ప్రత్యేకంగా సర్దుబాటుచేసుకోవలసిన వింకా [illegible] ఉన్నాయి.

అందుచేత ఆ యిద్దరికీ కొన్ని కొన్ని విషయాలలో మాటపట్టింపులు వచ్చినా— పెద్దగొడవలు ఏమీ రాకుండా చివరికి అవన్నీ సర్దుకుపోయాయి ఇంట్లో చేయవలసిన ఏర్పాట్లన్నీ పూర్తి అయిపోయిన తరువాత ఇంక చెయ్యవలసినది ఏమీ లేకపోవడంవల్ల మొదట్లో కొంత నిరుత్సాహంగా ఉందిగాని, కొత్త వారితో పరిచయాలు, కొత్తతోట్లకు షికారులు మొదలైనవాటివల్ల మొత్తంమీద అక్కడి జీవితం చాలా సౌఖ్యంగా గడిచిపోతున్నది

ఇలియిచ్ పొద్దున్నే కోర్టుకువెళ్ళి మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వస్తూండేవాడు సామాన్యంగా ఇంటిదగ్గర ఉన్నంతసేపు ఖులాసాగానే ఉండేవాడు గాని ఒక్కొక్కప్పుడు తన యింటి గోడకాగితాలవల్ల బాగా చిరాకు పడుతూండేవాడు బల్ల మీద పరిచిన తెల్లని బట్టమీద కొంచెం మరకపడినా, కిటికీ తెర గొలుసేమైనా కొంచెం వంకరపోయినా, అతని చిరచిరలకు అంతూదరీ ఉండేదికాదు. అయితే మొత్తంమీద జీవితం అంతా అతను కోరుకున్నట్లే అట్టే కలతలు లేకుండా హాయిగాను, మర్యాదగాను గడిచిపోతూ ఉండేది

ఇలియిచ్ ప్రొద్దున్నే తొమ్మిదింటికి లేచి, కాఫీ పుచ్చుకుని పేపరు చదివి, ఆఫీసుదుస్తులు ధరించి కోర్టుకు హాజరవుతూండేవాడు అక్కడ ఆఫీసు ధోరణిఅంతా అప్పుడే ఒకదారిని పట్టిపోతూ ఉండేది ఇలియిచ్ కూడా దానికేమీ అడ్డుతగలకుండా అదంతా అల్లాగే నడిపించుకుపోతూ ఉండేవాడు. అర్జీదారులు, విచారణలు, కోర్టుపరిపాలన, ఆఫీసు వ్యవహారాలు, మొదలైన విషయాలన్నిటిలోను, ఏదైనా నిజాయితీ గాని, కొత్తపద్ధతి గాని ప్రవేశపెడితే చాలా గందరగోళం బయలుదేరుతుంది అందుచేత ఇలియిచ్ జనం అందరితోను కేవలం అధికారపద్ధతిలోనే వ్యవహరిస్తూ, ఉద్యోగి హోదా నిలబెట్టుకుంటూ ఉండేవాడు. ఎవరైనా ఒక ఆసామి ఒక విషయం తెలుసుకోడానికి వచ్చాడనుకుందాము ఆ విషయం ఇలియిచ్ కి సంబంధించింది కాకపోతే, అసలతనా వ్యక్తిని దరిదాపులకే రానిచ్చేవాడు కాదు ఒకవేళ ఉద్యోగ ధర్మంలో ఎవరైనా తన దగ్గరికి వస్తే అధికారిగా తాను చెయ్యవలసిందంతా చేస్తూండేవాడు; అల్లాంటప్పుడు ఆ వ్యక్తితో పైపై మర్యాదల కేమీ లోటు రానీయకుండా మాట్లాడి, వెంటవెంటనే పంపించివేస్తూండేవాడు ఆ ఆఫీసుపని అయిపోయిం దంటే ఆ వ్యక్తికి సంబంధించినదంతా ఆ క్షణంతో

అభిరుచున్న మేరకే ఆఫీసు వ్యవహారాలు, వ్యక్తిగత వ్యవహారాలు, ఎప్పటికప్పుడే వేరువేరుగా చూసుకుంటూ, రెండు కలగా పులగం కాకుండా కాసుకోవడంలో ఇలియిచ్ చాలా గట్టివాడు. అలాగ కొంతకాలానికి ఈ రెండు ఒక కొసదాకా తీసుకుపోయాడు. దీనిలో బాగా అందవేసిన చెయ్యి కాబట్టి, ఒక్కొక్కప్పుడు ఉద్యోగవ్యవహారాలలో వ్యక్తి సంబంధాలు కూడా కలిసిపోనిచ్చేవాడు. అవసరం అయితే ఏ క్షణంలోనైనా ఈ వ్యక్తిసంబంధాలు జారవిడిచివెయ్యగల శక్తిసామర్థ్యం ఉన్నాయనే ధీమావున్నందే అతడీ విధంగా చేస్తూ ఉండేవాడు. ఇలా వ్యక్తిబంధవ్యాపారాలు వదులుకోవలసివస్తే ఎవరికీ నొప్పి కలగకుండా అతి చాకచక్యంతో అన్నీ ఇట్టే జారవిడిచివేస్తూండేవాడు. కోర్టుపని కొంత జరిగిన తరవాత, మధ్యాహ్నం వేళ విశ్రాంతిసమయంలో టీతాగి, సిగరెట్టుముట్టించి, రాజకీయాలు, పేకాట, మొదలైన వాటిని గురించి బాతాఖానీ చేస్తూండేవాడు. అయితే మొత్తంమీద, అది అంతా చాలావరకు ఉద్యోగాలు, పదవాయింపులు మొదలైనవాటి మీదే నడిచిపోతూ ఉండేది కాని, కోర్టు వ్యవహారాలన్నీ అత్యంత చాకచక్యంతో నిర్వహించి, ఇంటికి చేరుకున్న తరవాత బాగా అలిసిపోయి ఉండేవాడు. ఇంటికి వచ్చేసరికి భార్య, కుమార్తె సామాన్యంగా ఆ ఇరుగుపొరుగువా రెవరి ఇంటికైనా వెళ్లేవారు. లేకపోతే ఇరుగుపొరుగు వారెవరైనా వారింటికి వచ్చేవారు. కొడుకు స్కూలుకు వెళ్లి ప్రైవేటుమాష్టరు దగ్గరపాఠాలు చదివి, స్కూలులో చెప్పిన వేవో చదువుకుంటూ ఉండేవాడు. ప్రతీదీ అనుకున్నట్టుగా జరిగిపోతూ ఉండేది. భోజనాలయిన తరవాత మాటాడానికి వచ్చేవారెవరు లేకపోతే ఇలియిచ్ సామాన్యంగా ఆరోజుల్లో వాదోపవాదాలు లేవదీసిన పుస్తకాలు చదువుతూండేవాడు. సాయంకాలం కాగానే ఆఫీసు కాగితాలు చదివేవాడు. సాక్షులు చెప్పినవన్నీ జాగ్రత్తగా పరిశీలించి, లా ప్రకారం వాటి మంచిచెడ్డలు నిర్ణయించేవాడు. ఈ పని అతనికి నచ్చేదనిగాని, నచ్చలేదనిగాని చెప్పడం కష్టం. అది బ్రిడ్జి ఆడుకునే సమయమయితే ఆ పని అంతా నిరుత్సాహంగా ఉండేది. పేకాట లేకపోతే భార్యతో బాతాఖానీ వెయ్యడం కంటె బాగానే ఉండేది. ఇలియిచ్ విందు భోజనాలంటే చెవి కోసుకునేవాడు. పెద్దపెద్ద ఉద్యోగస్థు లందరినీ [illegible] ఈ విందులు కావిస్తూ ఉండేవాడు. అతని భవంతిలో జరిగే ఆ విందులు కూడా సర్వసాధారణంగానే ఉండేవి.

ఇవాన్ ఇలియిచ్ ఇంట్లో ఒకసారి నృత్యం జరిగింది. ఆ నృత్యం చూసి ఇలియిచ్ చాలా సంతోషించాడు. ప్రతీదీ బాగానే జరిగిపోయింది గాని ఆ విందులో వాడిన మిఠాయిని గురించి, భార్యాభర్తల లిద్దరి మధ్యా గట్టిగా అంటుకుంది. ప్రస్కోవ్యా ఫెడరోవ్నా ఈ విందంతా ఒకవిధంగా జరిపించాలని అనుకున్నదిగాని, ఇలియిచ్ ఆ విందుకు కావలసిన తినే సరుకంతా ఒక పెద్ద హోటలునించి తెప్పించాలని పట్టుపట్టి, వెనకాముందు చూసుకోకుండా బాగా దుబారాగా ఖర్చుపెట్టాడు. అలా తెప్పించిన సరుకులో చాలాభాగం మిగిలిపోయింది. అందుచేత హోటలుబిల్లంతా కలిసి తడిసి మోపెడైంది. చివరికి భార్యాభర్తల లిద్దరిమధ్యా బయలుదేరిన ఆ తగాదా చిలికిచిలికి గాలివాన అయింది. ఫెడరోవ్నా అతన్ని "చేతావాతా కాని తెలివితక్కువ దద్దమ్మ"ని కసిరింది. దానిమీద ఇలియిచ్ రెండుచేతులతోను తల గట్టిగా నొక్కిపట్టుకుని, ఒళ్లు తెలియని కోపంలో విడాకులదాకా వెళ్ళిపోయాడు.

అయితే ఆ నృత్యం అంతా చాలా బాగా జరిగిపోయింది. దానికి ప్రత్యేకంగా పెద్దపెద్దవాళ్ళంతా హాజరైనారు. ఇలియిచ్ ఆనాడొక జమీందారు చెల్లెలితో కలిసి నృత్యం చేశాడు. ఆ జమీందారొక పెద్దసంస్థ స్థాపించిన వ్యక్తి.

పై పదవులమీద ఉండే వ్యామోహం మూలాన ఇలియిచ్‌కి ఆఫీసుపని అంటే, మంచి ఉత్సాహంగా ఉండేది. ఇక విందు వినోదాలవల్ల అతనికి నే నింతటివాణ్ణి అనే అహంభావం బాగా బలిసేది. అయితే బ్రిడ్జిఆటఅంటే అతని రెండిటికన్నా ఎక్కువగా చెవికోసుకుంటూ ఉండేవాడు. జీవితంలో ఎలాంటి ఇబ్బందివచ్చినా బ్రిడ్జిఆట ఉంటే అది అంతా మరిచిపోయి ఎంతైనా ఖులాసాగా ఉండగలననీ, ఆ ఆట తన జీవితాని కొక చల్లని వెన్నెలవంటిదనీ అతడంటూండేవాడు. అయితే ఆ ఆటగాళ్లు శాస్త్రసత్తా గలవారై ఉండాలి, చీటికిమాటికి చిలిపి తగాదాలు తెచ్చిపెట్టకూడదు, అయిదుగురు కూర్చుని ఆడడంకంటె నలుగురుంటే ఆట మరీ మజాగా ఉంటుంది. అయిదుగురుంటే — పైకి ఆడుకొన్నట్టు నటించినా — ఎవరో ఒకరు ఆట మానివేసి [illegible] కూర్చోవాలి. అందుచేత నలుగురూ కూర్చుని, అతిచాకచక్యంతో ఆడుకుంటూంటే, కొంచెం మంచి ముక్కలుకూడా కలి [illegible]

చెంగ: అవునమ్మా! నీతో కాక మరెవరితో ఆలోచించగలను? పూర్వం, మధుర చొక్కనాథ నాయనివారి వెంకటకృష్ణప్ప నాయనితోడి యుద్ధంలో, మా తండ్రిగారు వీరస్వర్గము నలంకరించినప్పుడు, నాలుగేండ్ల పసిపాపడను నన్ను కాపాడి కాని, శత్రువులకంట బడకుండ ఎట్లో నాగపట్నం చేరి, కానిచోట్ల, కానిపాట్లుపడి, పెంచి, వన్నింత వానిని చేసినావు. నీ చేతిపాలతో, ఆహారముతో, పెరిగి, నీ ఆశీర్వాదబలమున ఈనాడు మరల తంజాపుర రాజ్యమును పొందగలిగేను నా తల్లిదండ్రులను నే నెఱుగను నా సర్వస్వము నీవే నీవు నాపాలిటి దాదివి కావు, దేవతవు

దాది (చెంగమలదాసును రొమ్మున హత్తుకొని) అవును బిడ్డా! పెంచేను ఆ రోజులలో, ఆ శత్రువుల అలజడులలో, ఆ అజ్ఞాతవాసంలో ఉండి, మనం అనుభవించిన బాధలు ఇంతింతలు గావు. వద్దు అవి తలచవద్దు ఒక్కమాటుగా గుండె పగిలిపోతుంది అయినా, మీ ఉప్పుకారముతో బ్రతికిన దానిని, దాదిని రొమ్మున గట్టుకొని మిమ్ము పెంచవలసిన బాధ్యత నాది నా ధర్మమును నేను నెరవేర్చుకొన్నాను.

చెంగ కాదు తల్లీ! విజయరాఘవనాయని వారి వంశాంకురమును, చేతులమీదుగా పెంచి, పెంపొందించినావు

దాది కాని, బిడ్డా! ఒక్కటే విచారము ఆ దుర్దినములు అట్లు వచ్చినవి విజయరాఘవనాయని వారి రతనాల మేడలో, నిన్ను బంగారు తొట్టెలతో ఊగించుభాగ్యము నాకు లేకపోయినది!

చెంగ నీ ఒడికన్న, నా కా బంగారుతొట్టె గొప్పా తల్లీ! అందువల్లనే, ఈనాడు నేను నీతో రాచకార్యములను ఆలోచింపవలెనని వచ్చినది

దాది పోనీ, నిన్ను కాదనేల? అట్టే ఆలోచింతము అంత ఆలోచింపవలసిన ఆ రాచకార్యం?

చెంగ: రేపు నాకు సామ్రాజ్య పట్టాభిషేకము కదా?

దాది: అవును ఆ మహోత్సవము నిరంతరాయముగా జరుగునుగాక!

చెంగ పూర్వపు మన సరదారులు, శ్రోత్రి వారు, పాచ్చాలు, ముఖ్యముగా మన విజయమునకు కారణభూతుడైన ఏకోజిరాజు మొదలైన ప్రభువులు, పలువురు వత్తురుగదా?

దాది వారి అందఱు సముచితముగ, దేవేంద్ర వైభవముతో, నీవు పట్టము కట్టుకోవాలి

చెంగ వారివారి గౌరవములకు తగినట్లు మనము నానావిధ వస్త్రభూషణ వస్తువాహన కానికనకాదులతో గౌరవించవలెను గదా?

దాది అవును అందుకు ఎంతో ధనం కావలెనని యేనా నీ ఆలోచన?

చెంగ: అవును రాజమర్యాదలను, పూర్వపు పేరు ప్రతిష్ఠలను నిలుపుకోవలెనుగదా? మనకు ధన మేది? క్రొత్తగా కోట స్వాధీన పరచుకొంటిమి శత్రువులు కొల్లగొట్టగా మిగిలిన కొద్దిపాటి ధనము మాత్రమే కోటలో మనకు లభించినది ఉత్సవపు ఖర్చులకే అది సరిపోవునట్లు లేదు

దాది అదా నీ ఆలోచన? మఱేమీ భయపడకు దైవంచల్లగా చూడవలెగాని, నీవంటి మహారాజుకు ధనం తక్కువా చెంగమలదాసూ?

చెంగ ఈపాడుపడిన కోటలో నాకు ధనం ఎలా లభిస్తుంది?

దాది అలాగే! రా ఇలా రా ధనం లభించే దారి చూపుతాను (అని మంచముపైనుండి లేచి, చెంగమలదాసును వెంటబెట్టుకొని వరుసగా కొన్ని గదులుదాటి, ఒక చీకటి గదిలోకి తీసికొనిపోయి) ఒక్కక్షణం ఉండు దీపం వెలిగించుతాను (అని దీపం వెలిగించి, తనచేతితో పట్టుకొని త్రోవ చూపుతూ) పద ఆ చీకటి గదిలోకి పద భయం లేదు పద (అని లోపలికి తీసికొనిపోయి) ఇదిగో, ఈ సారంగపు తలుపుతీయి ఇదిగో తాళపుచెవి

చెంగ అలాగే ఏది? (అని తాళపుచెవి అందుకొని తలుపు తెరుస్తాడు)

దాది: అదిగో, చూచావా? బంగారు ధనపు బిందెలు పైన మూతలు వేసి, సీలు వేసి బిగించి, నాగపడగల కాపుదలతో భద్రము చేయబడి ఉన్నవి చూచావా? నిన్ను చూచిన ఆనందముతో కాబోలు, అవి దీపపు కాంతిలో తళతళ మెఱసి పోతున్నవి ఆ బిందెలనిండ, వరహాలు, పొన్నారకాసులు, కోట్లకొలది ఉన్నవి వానిలోని సువర్ణభూషణములకు అంతులేదు అదిగో, ఆ బిందెలక్రింది సొరంగములోని గదిలో, నానా విధ రత్నములు, మేలేయని యింటిలో వలె, నిధులై ఉన్నవి. ఇవి అవి, అన్నియు నీవే

చెంగ: (నివ్వెఱపోతూ) ఇదంతయూ నాదనే?

దాది : అవును. నీ ధనమే. నీ తాత తండ్రుల ధనము నీ వంశ పరంపరకొక్కే. నీకై ఇచట నిక్షిప్తమై ఉన్నది. ఆనాడు యుద్ధములో నీ తండ్రిగారు విజయ రాఘవనాయనిగారు, ఇక ఓడిపోక తప్పదని నిశ్చయమైన వెంటనే, పట్టణములోని, జనానాలోని, స్త్రీలందరు, అంతఃపురములో అగ్నిలోపడి ఆహుతి అయినారు. ఆనాటి ఆ చితాగ్ని ధూమముతో నల్లబారి, పెటిలిపోయిన గోడలతో పాక్కిపోతూ ఈనాటికి నిలిచిఉన్న సరస్వతీ మహాలులోని గోడలను చూచితివిగదా ?

చెంగ హా! దుర్భరం!

దాది ఆ సమయమున, నాలుగేండ్ల పసిపాపవు, నిన్ను కాపాడి, మరల తంజావూరాధిపతిని చేసి, నీకు సంక్రమింప చేయవలెనను నూహతో, ఈ ధనము నిచ్చట దాచిఉంచినాము ఇప్పుడు బ్రదికిఉన్న వారిలో నాకును, రాయసం వెంకన్న నియోగిగారికి తప్ప, మరెవ్వరికీ ఈ రహస్యం తెలియదు నీకడుపు చల్లగా, ఈనాడు మా కోరికలు సఫలమైనవి

చెంగ అమ్మా! నిజంగా నీవు నాపాలిటి దేవతవు కృతజ్ఞుడను

దాది పారలతో త్రవ్వి గోతాల కెత్తించి, రత్నరాసులు తీసికో బంగారు బిందెలు రెండు వైపుల పెట్టించుకో కేళ్ళ నిండుకొలువులో పట్టాభిషిక్తుడవై, ఈ దీర్ఘబాహువులతో, ఈ పెద్ద దోసిళ్ళతో, నీ యిష్టము వచ్చినట్లు బహూకరించు ఎంత ఖర్చుపెట్టగలవో, నీవి ఎంత పెద్ద చేతులో చూతాము

చెంగ : అలాగే పూర్వం కట్టడచేసికొన్న ప్రకారం, ఏకోజిరాజుకు లక్షవరహాల నగలు, వస్త్రములు, నాలుగు ఏనుగులు, వెండి బంగారు ముత్రిదులు చేసిన గుర్రాలు ఎనిమిది, కాక, అయన సొంతానికి ఇనాముగా పదిహేనులక్షల నాణేలు ఇస్తాను. వారివెంబడి కార్యస్థులకు లక్షవరహాలు నగలు, దివాన్ పేష్వాయికి రెండులక్షల నాణేలు, భాసుడికి లక్ష నాణేలు; పయిదువాహేబుకు లక్ష రూపాయలు; తక్కిన సరదార్లకు పదేసి వేల నాణేలు, కాక, అదనంగా వారు కోరినన్ని ఇచ్చివేస్తాను. యుద్ధములో వారు మనకు చేసిన సహాయం ఎన్నటూ మఱువరానిది. ముఖ్యంగా మన రాయసం వెంకన్న నియోగిగారికి అంతులేని ధనం ఇవ్వడమేకాక, ఆయనకు అంబారీ ఉత్సవం చేయిస్తాను. ఆయన బుద్ధిబలంవల్లనే కదా, ఏకోజి సహాయం మనకు లభించి, మనం ఇంతవారమయింది? అమ్మా! నీ ఆశీర్వాద బలం. ఇక నా కేవిచారము లేదు.

దాది అలాగే నిర్విచారంగా, తాతముత్తాతల పేరు నిలుపుతూ, రాజ్యమేలు. అభిషిక్తమైన మూర్ధముతో, రత్నకిరీటముతో, నా కన్నులకు పండుగ చేయి పద ఇక ఆ గొట్టుతలుపు వేసివేయి. అవతలికి పోదాం (అని గదిలోనుండి వెలుపలికి సాగుతుంది)

చెంగ (గొట్టు తలుపులు వేసి, దాదిని అనుసరిస్తాడు)

దాది (త్రోవలో వెనుదిరిగి చెంగమల దాసును చూచి) మరి, క్రొత్త ఉద్యోగాల నియామకాలన్నీ పూర్తి అయినవా ?

చెంగ ఈరోజు సభలోనే అవన్నీ పూర్తి ఐనవి కాని

దాది ఆఁ కాని ?

చెంగ ఒక్క నియామకం మాత్రం మిగిలిపోయింది

దాది ఏమిటిది ?

చెంగ . రాయసం విషయం

దాది ఎందువల్ల ?

చెంగ : రాయసం ప్రధాని నియామకం విషయంలో పలువురు పలు అభిప్రాయాలు సూచించినారు.

దాది నిర్ణయానికి రాలేదా ?

చెంగ లేదు తరతరాలనుండి ఆ పదవిలో ఉంటున్నవారిచే, ఈనాడుకూడ నియమించటం మంచిదని కొందఱు, క్రొత్త ప్రభుత్వం కాబట్టి, సమర్థులైన క్రొత్తవారిని నియమించవచ్చునని కొందఱు; వాదోపవాదాలు లేవదీసినారు

దాది తరతరాలవారు అంటే, రాయసం వెంకన్న నియోగిగారే కదా ?

చెంగ . అవును

దాది : మరి నీయిష్టం ?

వెంక : నాకు కూడ అదే సమంజసముగా తోచినది. వెంకన్నగారు, మన విజయ రాఘవనాయని గారికి విశ్వాసపాత్రులేకాక, రాజ్య సుప్రతిష్ఠకు తమ యావచ్ఛక్తిని ధారపోసిన వారని అందరినోట అహర్నిశలుగా వినవస్తున్నది. అంతే కాక, ఈనాడు ఈ యుద్ధములో, వారు మనకు చేసిన ఉపకారము అమేయము. అందుకు మనము వారికి కృతజ్ఞులము కావలెను గదా ?

దాది : తప్పక.

వెంక. కాని, సభలోని వాదోపవాదాలతో కాలాటూ పాలుపోక, నీతో ఆలోచించిన మీదట కార్యముఖమునకు రావచ్చునని, ఆ చర్చ వాయిదా చేసినాను ఆ విషయమే, ఇప్పుడు నీతో ముఖ్యముగా ఆలోచింపవలసినది.

దాది సరి సరి ఇట్టి గడ్డు సమస్యలలో, ఆడు దాని ఆలోచన ? ఇక ప్రళయం అట్టే దూరంలో ఉండదు

వెంక నీవు నా తలపులో అందరి ఆడువారి వంటిదానవుకావు ఇప్పుడు నీ ఆలోచన నాకు తప్పక కావాలి

దాది అత్యంతము బాధ్యతగల ఇట్టి నియామకములు, దూరాలోచనతో చేయవలసిన పనులు

వెంక : అవును

దాది రాయసం నియోగి వెంకన్నగారిని పూర్తిగా నీ బిడుగవు ఆయన వెంటనే యుగంధరుడు

వెంక అయిన, ఆయన అసాధారణప్రజ్ఞ మనకు క్షేమమే కదా !

దాది క్షేమము కావచ్చును, మరొకటి కావచ్చును అది ఆయన నిగ్రహా[illegible]గ్రహములను బట్టి ఉంటుంది.

వెంక ఒకప్పుడు మనపై నిగ్రహింపవలసిన అవసరం ఆయన కేముంటుంది ?

దాది పగపట్టి కాటువేయటానికి, త్రాచు పామునకు, మన మేమి అపాయం కలిగించాలి ? అది దాని స్వభావం

వెంక అంటే !

దాది · నియోగి వెంకన్నగారు అంతే.

వెంక · అఁ ?

దాది సందేహమా ? పూర్వము, మధుర నాయకులతోడి పగలు మున్నగువానిలో, వెంకన్నగారి ఎత్తు పైయెత్తులు అలా ఉండనీ మొన్న మొన్నటి అళగరన్న పోరులో ఆయన చేసినకుట్ర ?

వెంక అప్పుడు వెంకన్నగారు కుట్ర చేసినారా ?

దాది అవును. పచ్చికుట్ర మొట్టమొదట మీ తండ్రి విజయరాఘవనాయనివారు యుద్ధంలో ఓడిపోగానే, తంజావూరులో చొక్కనాథ నాయనిచే అళగరన్న, తమ ప్రతినిధిగా నియమితుడైనాడు వారిరువురిలో మిత్రభేదం పుట్టించి, వెంకన్నగారు, మహాయుద్ధం తెచ్చిపెట్టినారు. ఆ తరువాత, ఏకోజీ రాజాతో చేరి, ఆయనను అళగరిపై దండెత్తించినాడు తత్ఫలితముగా ఈనాడు నీ కీ తంజావూరు రాజ్యం లభించింది.

వెంక మనకోసమే గదా ఆయన ఇంత చేసినది ?

దాది కుట్రదారుల కుట్రలు పైకి అలాగే ఉంటవి ఇది మనమీది అనుగ్రహం కాదు ఏ నిమిషాన ఎట్టి విపత్తునైనా, వెంకన్నగారు, నిర్దాక్షిణ్యముగా తెచ్చిపెట్టగలడు తడిగుడ్డలతో గొంతులు కోయగలడు అట్టి స్వార్థపరుడు. క్షణములో ఒకరిని దింపి, ఒకరిని నిలబెట్టి, ఆయన రాజకీయములను తలక్రిందులు చేసి వేయగలడు ఆయన స్వార్థమునకు అంతులేదు

వెంక అందుకు నిదర్శనం ?

దాది రాయసం నియామకములో ఆయన యాశీభావమే ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా ఉండి, నిన్ను, తన హస్త నిర్దేశములపై నడిపింపవలెనని ఆయన తలంపు అది నీ ఎఱుగవు ఆయనతో మా తలలు బొప్పులు కట్టినవి

వెంక : అమ్మా ! ఇదంతా నిజమా ?

దాది నిజంకాక మరొకటా బాబూ ! ముమ్మాటికి నిజం ఇప్పటికి నీవు పదుహాలుగేండ్లు నిన్నగా నిండలేదు. అమాయికుడవు ఇట్టి పన్నాగములు నీవు తెలిసికోలేవు.

వెంగ అయినా, నన్ని ప్రశ్నలు చేయుటకు నీ తలపో ?

దాది : అదే ఆలోచిస్తున్నాను. (కొంచెం ఆలోచించి) నీ వన్నట్లు ఆపదలో ఆదుకొన్నవారికి మనం జన్మ జన్మకీ కృతజ్ఞులమై ఉండాలికదా ?

వెంగ తప్పక

దాది అట్టివారిలో, మనకు ఈ నియోగి వెంకన్నగారి కంటె ఇంకా చాలా ముఖ్యులు ఉన్నారు.

వెంగ ఎవరువారు ? అమ్మా ! నేనా మహనీయులను స్మరించక, వట్టి కృతఘ్నుడ నవుతున్నానా ?

దాది నీ కెవరూ జ్ఞప్తికి రాలేదా ?

వెంగ రాలేదమ్మా ! రాలేదు ఎవరో చెప్పు.

దాది తనయింటిలో మన కాశ్రయమిచ్చి, అన్నవస్త్రాదులతో పోషించినవాడు

వెంగ అవునవును నాగపట్నములో ఆ కోమటిసెట్టి.

దాది దుర్మార్గులైన శత్రురాజవర్గములవారి వలన రాగల కష్టనష్టములను కూడ లెక్కింపక, తన యింటి పసిబిడ్డను నిన్ను, నన్ను, దాచి,పదేండ్లు, తాను కంట నిదురలేక, కంటి రెప్పవలె కాపాడి నాడు

వెంగ అవును అతనికి మనము సర్వదా కృతజ్ఞులము.

దాది అంతేకాదు. ఎంతో ధనం వెచ్చించి, నీకు రహస్యముగా అన్ని విద్యలు నేర్పించి, ఇంతటి వైభవమునకు కారణమైనాడు. ఆ కోమటిసెట్టికి, ఏమి ఇచ్చి, ఎన్ని జన్మములలో ఋణము తీర్చుకో గలము ?

వెంగ : లేదు. ముమ్మాటికీ వాని ఋణం తీఱదు.

దాది : బిడ్డా ! ధనరాసులు అర్పగించి, నీవా గ్దానములను నీవు చెల్లించుకొనుటకు అవకాశము కల్పించినాను గదా ? నాకు కూడ ఒక వాగ్దాన మున్నది. అది నీవు చెల్లించవలె.

వెంగ : అట్లే చెల్లింతును. ఏమిటది ?

దాది : పెంచినతల్లినిగా నిన్ను అర్థిస్తున్నాను. నీవు నా వాగ్దానమును తప్పక చెల్లించాలి

వెంగ : త్రికరణశుద్ధిగా చెల్లించగలను అమ్మా! ఏమిటది ? త్వరగా చెప్పు

దాది నా తను మనః ప్రాణములతో నిన్ను కాపాడుకొనుటే నాపరమలక్ష్యము. అందులకే, నాగపట్నము చేరగానే నేనా కోమటిసెట్టిని మంచి చేసికొని, అతనితో ఒక ఒప్పందమునకు వచ్చినాను.

వెంగ : ఏమని ?

దాది : ఎన్నికష్టములకైన, ఎంత వ్యయమున కైన, ఓర్చి, మాపసిరాజును, పోషించినచో, ఆయన తిరిగి తంజావూరు రాజ్యమును పొందిన పిమ్మట, ఆయన రాచరికములో, నీకు దళకర్త ప్రధానికం ఇప్పించగలనని, నేనా కోమటిసెట్టికి వాగ్దానం చేసియున్నాను దైవకృపతో నీవు తిరిగి తంజాపుర మహారాజువైనావు ఈనా కోరిక చెల్లించి, నన్ను అసత్యదోషమునుండి రక్షించుబిడ్డా !

వెంగ వట్టి పిరికి కోమటిసెట్టికి దళకర్త ప్రధానికమా ?

దాది ఎందుకు కాగూడదు ? అందఱు చెప్పట్ల వలె అతడు పిరికివాడు కాదు

వెంగ అంతమాత్రమున అతడు దళకర్త ప్రధానికమును నిర్వహింపగలడా ?

దాది తప్పక నిర్వహింపగలడు. అతడు మిక్కిలి సమర్థుడు అన్ని రాజ్యతంత్రములు అతనికి తెలుసును అంతియగాక, అతనికి అపారమైన ధన బలము, బుద్ధిబలము, ఉన్నవి. పడవలపై పెద్దపెద్ద వర్తకములుచేసి, దేశదేశముల పేరుకెక్కినవాడు. అవసరమైనచో నదులపై, సముద్రములపై, ఓడలతో సేనలను నడిపి, శత్రులను పట్టుకోగలవాడు.

వెంగ పోనీ ఆ సెట్టి అంతటి ఘటికుడే అను కొందాము. మన మీ పదవిని అతని కిచ్చిన, మన కొలువువారు సమ్మతిస్తారా ?

దాది సర్వాధికారియైన మహారాజుకు, ఇత రుల సమ్మతితో పనియేమి ?

వెంగ : పోనిమ్మా. నీవన్నట్లు దళకర్త ప్రధా

వికమునకు అతీంచుకొని ఉన్న వెంకన్నగారికి, ఇది పరాభవము, కోపకారణము, కాదా?

దాది అయిన, అగుగాక. ఆయన కోపంవల్ల మనకు నష్టం?

చెంగ : ఆయన యుగంధరుడని నీవే చెప్పితివి గదా?

దాది ధనబలము, బుద్ధిబలము, అధికారబలము, ఉన్నవారిముందు, ఇట్టివారు ఒక లెక్కా? జమా? ఆయనవల్ల నీకు వచ్చిన భయమేమీ లేదు

చెంగ ఒకవేళ వెంకన్నగారే, సభలో, ఆ పదవి నాకే కావలెనని పట్టుపట్టిన?

దాది నీవు నిర్భయముగా దళకర్త ప్రధానికము పెట్టికిచ్చి, కావలెనన్నచో వెంకన్నగారికి, ఆ పెట్టెక్రింద పేష్కారికాని, సీమ అమలుగాని, ఇయ్యవచ్చును అంతేగాని, పదిసంవత్సరముల్లు మనలను కాపాడిన ఆ పెట్టెని వదలి, ఈ పదవిని, ఈ మునలికాపడికి ఈయ వీలులేదు

చెంగ అమ్మా! ముమ్మాటికీ ఇదే నీ యిష్టమైనచో, అలాగే చేస్తాను కాని, నియోగి వెంకన్నగారు, తన కిది పరాభవముగా పరిగణించి, మన కొలువు విడిచి పోగలడేమో అని నాకు తోస్తున్నది

దాది పోతే నేమి?

చెంగ వెనుకటివలెనే, ఏకోజీతో కలిసి కుట్రలుపన్ని, మనపై పగతీర్చుకోగలడని నా నమ్మకం

దాది అంత రొత్తు వచ్చినప్పుడు మాచుకో వచ్చును మన సిబ్బందిలో మాత్రము అంత చేతులు చచ్చినవా రెవరు? అన్నిటికిని పెట్టియేగలను భయపడకుము.

చెంగ సరే, నీ యిష్టం ప్రకారమే నడుస్తాను రాత్రి చాలా ప్రొద్దుపోయింది ఇక పోయి వస్తాను

దాది : చిరంజీవ!

చెంగ (వెళ్ళిపోతాడు)

---

దృశ్యం—2

[స్థలం—కుంభకోణంలో ఏకోజీ కొలువు సమయం—ఉదయం]

(ఏకోజీ కొలువుదీరి ఉంటాడు. పేష్వాయి భావు, నయిదు సాహెబు, రాయసం వెంకన్నగారు, పరివేష్టించి ఉంటారు)

ఏకోజీ వెంకన్నగారూ! మీరు మా ఆస్థానానికి వచ్చిన ఇంతకాలంనుండి, మాకు చాలా ఉత్సాహంగా ఉంటున్నది.

వెంకన్న ఏకోజీ మహారాజుల అవ్యాజానుగ్రహమునకు కృతజ్ఞుడను

ఏకో మంచి, తంజావూరు విశేషము లేమి చెప్పక పోతిరి?

వెంక చెప్పుట కేమున్నది మహారాజా! ఈనాడు తంజావూరు వెనుకటి తంజావూరుగా లేదు

ఏకో అనగా? సుభిక్షమేనా? మన చెంగమలదాసు

వెంక సుభిక్షమే చెంగమలదాసు దేవేంద్ర భోగములను అనుభవిస్తున్నాడు

ఏకో—సంతోషం మన చేతులలో రాజ్యములో నిలిపిన ఆ పసిపాపడు, అంతవాడు కావడం, మాకు చాలా సంతోషం

వెంక ఏకోజీ మహారాజుల అనుగ్రహం అటు వంటిది తంజావూరు వారిప్పుడు బహుముఖముల రాజ్యమును పెంపొందించినారు క్రొత్త క్రొత్త కట్టడములు, క్రొత్త క్రొత్త మందిరములు, కట్టించినారు క్రొత్త క్రొత్త పేటలను కట్టించి, ఎన్నో ఆగారములను, ఆయుధశాలలను, నిర్మించినారు అన్నింటికన్న బృహదీశ్వరాలయమును అనేక విధముల పెంపొందించినారు. ఎందుకో, అందు అనేక రహస్య ప్రదేశములనుకూడ ఏర్పరచినారు.

ఏకో — ఎందుకేమున్నది? రాజ్యమును విస్తరింపజేయుట, కావలసిన క్రొత్తవాని నిర్మాణము, జీర్ణోద్ధారము, మున్నగునవి, రాజధర్మములే కదా!

వెంక · కావేరిలోనుండి క్రొత్తక్రొత్త కాలువలు, వానిపై క్రొత్త వంతెనలు, బ్రహ్మాండముగా నిర్మించినారు కావేరి నీటితో తంజాపుర మీనాడు బంగారము పండుతున్నది. ఎన్నో గజశాలలు, గుఱ్ఱాల చావడులు, ఏర్పరచినారు. అందుగల రహస్యాయుధాగారములకు లెక్కలేదు.

ఏకో: అట్లాగా? అయిన, ఈనాటి తంజా పుర వైభవమును ఒక్కసారైన చూచిరావలెనికదే!

వెంక: చూచిరావన దేమిటి? మహారాజుల వారు తలచినచో, అందే నిలువవచ్చును

ఏకో: అదేమిటి వెంకన్నగారూ? అది మన రాజ్యము కాదుగదా?

వెంక: మన రాజ్యము కాక, వారి చెట్లనుగు? కష్టపడి మహారాజులు సంపాదించి యిచ్చినదేకదా?

ఏకో: తోడిరాజులకు, మా కోరికవల్ల సహాయం చేసినాము అంతే. అయినా, ఇప్పుడు తంజా పూరులో వచ్చిన విపరీత మేమిటి? చెంగమలదాసు మనకు మిత్రుడే గదా?

వెంక: అవును మహారాజా లన్నట్లు, చెంగ మలదాసు మనకు మిత్రుడే! కలిసిన మిత్రునియింట మిత్రులు కొంతకాలం నిలువగూడదా?

ఏకో: ఓహో! అదా మీ అభిప్రాయము? అయిన సంతోషమే.

వెంక: తంజావూరు ప్రభుత్వవిధానము కూడ కొంత మారినది. అసలు, వారి అభిప్రాయములే మారినట్లున్నవి

ఏకో: ఎందువలన?

వెంక: రాజ్యములో అన్నిశాఖలను పెంచుటయే గాక, వారు ముఖ్యముగా కోటలను బందోబస్తు చేసి, సైనికశాఖపై దృష్టి కేంద్రీకరిస్తున్నారు ఇప్పటికిప్పుడే, సేనాబలము అపారముగా సమ కూర్చినారు. క్రొత్తక్రొత్త దళవాయులను నియా మకంచేసి, అడ్డుగడ్డుగ నిలిపినారు. చూడగా, వారి ఉద్దేశములో, ఏదో దండయాత్రనో, మరేదో, ఉన్నట్లున్నవి

ఏకో: వారెవరు? ఈ యేర్పాటులలో మీరు లేరా?

వెంక: లేను.

ఏకో: కారణం?

వెంక: ఈనాడు చెంగమలదాసుకు నేను పనికిరాను.

ఏకో: మరి, మీ రాయసపు పదవి?

వెంక: నాకు లేదు. నేనిప్పుడు తంజావూరు పౌరుడనుకూడా కాను.

ఏకో: మరి, యిప్పుడు తంజావూరు దళకర్త ప్రధానికం?

వెంక: ఒక కోమటిసెట్టికి

ఏకో: అతడెవరు?

వెంక: నాగపట్నమువాడు చిన్న తనము న చెంగమలదాసును, దాదిని, తన యింటనుంచుకొని ఆదరించి పోషించినాడు. అందువలన అతని కీనాడు ఆ పదవి లభించినది

ఏకో: ఓరికి కోమటిసెట్టి దళకర్త ప్రధాని! అహ్హహ్హా! (విరుగబడి నవ్వుతాడు)

(సభలోని వారందరు పెద్దగా నవ్వుతారు)

శేషువాయి (నవ్వుతూ) వెంకన్న గారూ! మీ రాజాకు ఏమైనా మతిపోయిందా?

వెంక: మతే కాదు

ఖాను: ఈ అధికారం, మీకు గాకపోతే, మరొక బ్రాహ్మడికి గాని, పలను మొదలికి గాని, మరొక సమర్థునికి ఈయవచ్చును గదా? ఈ కోమటి సెట్టి యేమిటి?

వెంక: బాలరాజా చిత్తం అలా పనిచేసింది

నయుదు: ఇది రాజాచిత్తం కాదు తెరచాటు భాగవతిపువారి చిత్తం అయిఉంటుంది

ఏకో: సరిసరి ఆ నియామకం జరుగునప్పుడు మీరు కొలువులో లేరా?

వెంక: ఉన్నాను మొట్టమొదట దళకర్త ప్రధానిగా నన్నే నియోగింపదలచి, నాకై తెప్పిం చిన అలంకారములతో సెట్టిని అలంకరించి, అతని చేతికి అధికారి ఉంగరం వేయించి, చెంగమలదాసు ఆ కోమటి సెట్టిని ఏనుగు హౌదాలో కూర్చుండబెట్టి పట్నం ప్రవేశం చేయించినాడు

ఖాను: పరాభవం! బట్టి కృతఘ్నుడు

శేషు: తంజాపుర రాజ్యానికి మీరు మీ సర్వ శక్తులు ధారపోసినారు!

నయుదు: ఏకోజీ మహారాజుల సహాయమును కూడా, చెంగమలదాసు, ఈనాడు తలపోసినట్లులేదు.

వెంక: పట్నం ఊరేగివచ్చి, ఏనుగు దిగి, ప్రభువు పాదాలపై బంగారుపూలు చల్లి, నిలబడ గానే, చెంగమలదా సాతనిని కౌగిలించుకొని, దగ్గ

రగా కొలువులో ఇట్లు ప్రకటించినాడు:— నేటి నుండి ఈ కోమటిసెట్టి మన దళకర్త ప్రధాని ఈ రోజు మొదలు మీరందరు ఈ సెట్టి ఆజ్ఞ ప్రకారం నడుచుకోవాలి—

ఏకో : అందుకు కొలువువారందరూ సమ్మతించారా?

వెంక ప్రభు చిత్తమునకు అత్యంతకరమా మహా రాజా? అలా చెప్పి, రంగములదాసు, మరల ఇలా శాసించినాడు—గౌరవ చిహ్నముగా మీరందరు, మన దళకర్త ప్రధాని సెట్టిగారితో, వారి విడిదిదాకా పోయి, సెలవు గొనిరావాలి— రాజాజ్ఞ ప్రకారం అందరు అట్లే కావించినారు.

పేమ మీరు?

వెంక నామాత్రం అది దుర్భరం అయింది ఇక ఈనాటితో తంజావూరుకు, నాకు ఋణం తీరింది ఇంత పరాభవంతో ఇక్కడ ఉండలేకన్న, ఎప్పటి కైనా పోయి, భగవద్ధ్యానంతో ఈ వృద్ధాప్యంలో కాలం గడుపుకోవచ్చునని, వెంటనే ఇల్లువదలి, దేశాంతరములకు బయలుదేరినాను

ఖాను అప్పటికే రంగములదాసు, మీ విషయం ఆలోచించనే లేదు?

వెంక ఆలకి! అంత తీరిక, అవకాశము, ఎక్కడిది? కొలువులో అట్టి విపరీతశక్తుల ప్రవేశించినవి ప్రభువు స్వయంగా అన్యాయికుడు, కాలుడు

ఏకో ఆ తరువాత?

వెంక దేశాంతరములకుపోతూ, త్రోవలో, మహారాజావారి దర్శనం చేసికొని, కొలదిదినములు ఇచ్చట నిలువవచ్చునుగదా అని, ఇచ్చటికి వచ్చినాను

ఏకో ఇంత వృద్ధాప్యంలో మీ కిట్టి అగౌరవం మాకు సహించరానిదిగానే ఉన్నది మీరిచ్చటికి రాక, మాకు అపరిమితానందం కలిగించింది ఇక మీరెక్కడికీ వెళ్ళ నక్కరలేదు. హాయిగా మాదివాణములో, శాశ్వతముగా నిలిచి పోవచ్చును.

వెంక మహారాజుల అనుగ్రహమునకు కృతజ్ఞుడను

(సభికులందరు నవ్వుముఖాలతో తమ ఆనందం, సమ్మతి తెలియచేస్తారు)

ఏకో (ఇంచుక ఆలోచనతో) వెంకన్న గారూ! ఇంతకు, ఈ విషయంలో, తంజావూరు దొరల అభిప్రాయం?

వెంక ఏముంటుంది? ఇక తంజావూరు రాజ్య పతనానికి అట్టే దూరంలేదు అందువల్లనే, వారు ఆ కోమటిసెట్టిని ఆ పదవిలో నియోగించు కొన్నారు

ఏకో అందుకు ప్రబలమైన కారణం?

వెంక రంగములదాసును పెంచినవాడికి, ఆ కోమటిసెట్టి వలభ్రముండు

ఏకో ఓహో! అర్థమయింది బాల నాయకత్వము! స్త్రీ బుద్ధి!

వెంక చిత్తం మహారాజా! మీ చేతుల ప్రతిష్ఠితమైన తంజావూరు సింహాసనము, నేడో, రేపో, మనకళ్ళముందే, పరాయి దొరలవశం కానున్నది అదే నాకు పట్టిన హృదయవేదన

ఏకో పాపం! వట్టి అదృష్టహీనులు!

ంక అని పెదవి విఱచి, ఈ సమయంలో మనం ఊరుకోనరాదు మహారాజా!

ఏకో ఊరుకోనక?

వెంక ప్రభువులే ఆ సమస్యను దక్కబరచవలె

ఏకో ఎట్లు?

వెంక తాము సంపాదించిన తంజావూరు సింహాసనము తామే నిరర్థ్యంతరంగా లోబరచుకొనవచ్చును

ఏకో వెంకన్నగారూ! చేసిన విస్తరి తీసి చేసి, పాపం కట్టుకోమంటారా?

వెంక పతనోన్ముఖమైన రాజ్యమును ఉద్ధరించుట పాపమా మహారాజా!

పేమ (ఏకోజితో) ఒకప్పుడు మన మేకదా, రంగములదాసుకు సహాయం చేసినది?

ఖాను మరల మన శౌర్యముతోనే, అదొగ విద్దను కాగవలెను.

పరయిదు. అవశ్యం.

హొగధులు ! శ్రీ రామచంద్ర సాంద్రకరుణా కటాక్ష లబ్ధసిద్ధ సారస్వతవిశేష, నిరర్గళవాగ్వైభవ శేష, నవరససాహిత్య కళాభోజ, సత్కవి సంభావిత ముఖాంభోజ, సకల సామ్రాజ్యధౌరేయ, నిత్య వితీర్ణ ధారాధారాధేయ, నిరతాన్న సత్ర సంతోషిత పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదాన వైభవావర్తిత కీర్తిభాసుర, నిజనామాంకిత కనక వస్తు సమగ్ర బహుళాగ్రహార భూషిత చోళధరా మండల, నిఖిలభోగవిభవ వినిర్జితాఖండల, సాధిత సముద్రాంతరద్వీప, పరనృపాలసంస్తుత ప్రతాప, నేపాల భూపాలస్థాపనాచార్య, కర్ణాట రాజపూజనీయ ధౌరంధర్య, రామసేతు శ్రీరంగ విజయరాఘవ పుర మంటపగోపురాది దివ్యస్థలప్రతిష్ఠాపిత శ్రీరామభద్ర, సర్వజనసంభావిత గాంభీర్యముద్రా వినిర్జిత సముద్ర, సదాశ్రిత భరణదీక్షా దక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సమ్మానితా సాధారణ శౌర్య, దిగంతర ప్రసిద్ధత ఔదార్య, సుజ్ఞాన జనక, సతత సంసేవితజనక, దీక్షితవిద్వత్కవియూథ, భువన లోకైకగుణసనాథ, బలవద్వైరి సంధిగృహీత సామంత మహీకాంత వినోదన శ్లాఘనీయ మహాబల, మార్తాండ గర్భ శుక్తి ముక్తాఫల, చిన చెవ్వయాచ్యుత నృపాలపుత్త్రి, సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖా విజిత కుసుమసాయక, రఘునాథ నాయక ధరా సంక్రందన నందన, జగదానందన, సకలసామ్రాజ్య ధౌరేయ, నిత్య వితీర్ణ ధారాధారాధేయ, నిరతాన్న సత్రసంతోషిత ద్వాదశ సహస్రభూసుర, బహువారావర్తిత మహాదాన వైభవావర్తిత కీర్తిభాసుర, కర్ణాట రాజపూజనీయ ధౌరంధర్య, రాజగోపాలనిత్య కైంకర్యధురంధర్య, భువనవిజయ, శ్రీ విజయరాఘవేంద్ర ధరణీంద్ర శ్రీ కళావత్యంబికానందన, సుకవిజన చందన, పునర్నిర్మిత తంజాపుర రాజ్యలక్ష్మీ దృఢపరిష్వంగ, దళిత విమత జన మదమాతంగ, రంగధ్యానవిలాస, శ్రీ చెంగమలదాస, రాజాధిరాజ మహారాజ ! జయ! విజయీభవ ! విజయీభవ !

(హొగధుల విజయవాక్యాలు ఆగిపోతవి)

చెంగ : శెట్టిగారూ ! వెంకన్నగారి వర్తమానాన్ని గురించి మీ అభిప్రాయం ?

శెట్టి : ఏమున్నది ? ఏలోకేశరాజా, ఎందువల్లనో మనపై ఆగ్రహించే ఉన్నాడు.

చెంగ ఆయనపట్ల మనమేమైనా అపచారం చేయలేదే ?

శెట్టి మనమైతే చేయలేదు

చెంగ మరెవరైనా చేసినారంటారా ?

శెట్టి ఏమో ? ఈ విశాల సామ్రాజ్యంలో, ఏమూల, ఎక్కడ, ఏమి జరిగిందో ?

చెంగ : మన ఎరుక లేకుండానే ?

శెట్టి ఎంతకని కనిపెట్టి ఉండి, కనుక్కోగలం ? ఒక్క దుకాణంలోనే ఏమూల ఏమి ఉన్నదో కనుక్కోవడమే కష్టమే ! ఇంత ఇంత ప్రజని ఎవరు కనిపెట్టగలరు ?

చెంగ అయితే, అపచారం జరిగిందనే అంటారు ?

శెట్టి చేయకతెలవని ఎవరూ అట్లా అపచారం చేసిఉండరు ఏదో నలుసంత విషయం, ఆయనకు అపచారంగా తోచిఉండవచ్చు

చెంగ అంతమాత్రంతో, ఏలోకేశ!, మనపై దండెత్తివలసినంత అవసర మేమి వచ్చింది ?

శెట్టి అవసర మేమిటి ? ఆ మాయమరాఠీ వాళ్ళని నమ్మినవాళ్ళెవరు ? వాళ్లు ఎంత పనిఅయినా చేస్తారు. ఉత్త దారిదోపిడిగాళ్లు

చెంగ మీ రనుకొన్నట్లు, ఏలోకేశరాజా, దొంగల దండునాయకుడు, లూటీదారు, కాడు

శెట్టి కాకపోతే, అంత దూరదేశంనుండి, ఇంతదాకా ఎందుకు వస్తాడు ?

చెంగ : మన సహాయంకోసం.

శెట్టి పోనీ, వెంకన్నగారే స్వయంగా ఇలా వచ్చి అబద్ధాలు వ్రాసిపంపినారనా మహారాజుల వారి అభిప్రాయం ?

చెంగ ఏమో, బోధపడటం లేదు

శెట్టి : వెంకన్నగారు ఎన్నడూ అలా వ్రాయరు. వారు మన ఆశ్రితులు మన క్షేమం కోరినవారు.

చెంగ : ఒకప్పుడు అంతే.

శెట్టి . ఒకప్పు డేమిటి ? ఎప్పుడూ అంతే. చెంగమల దాసమహారాజుల అంటే, ఆయన ప్రాణం విడుస్తాడు.

వెంక: ఈ విషయంలో, మా దాదిఅమ్మ అభిప్రాయం ఎలా ఉంటుందో?

సెట్టి: ఆఁ! ఆమె అభిప్రాయం తప్పక తెలిసి కోవలసినదే.

(దాది ప్రవేశం)

సెట్టి: అదిగో, మాటలోనే ఆమె కూడా వచ్చింది. సంఘటన అంటే, అలా ఉండాలి.

దాది: ఏమిటి విషయం?

వెంక: అమ్మా! ఈనాడు, రాయసం వెంకన్న వియోగి గారు, మా కొలువుకు ఒక వర్తమానం పంపేరు.

దాది: వెంకన్న గారా? ఇప్పుడు వారెక్కడ ఉన్నారు?

వెంక: అయ్యంపేటలో.

దాది: ఏం చేస్తున్నారు?

వెంక: వృద్ధాప్యంలో విశ్రాంతిగా కాలం గడుపుకొంటున్నారట

దాది: వారి వర్తమానం అయ్యంపేటనుంచే పంపేరా?

వెంక: అవును

దాది: ఏమని?

వెంక: సెట్టిగారూ! ఏదీ ఆ కమ్మ చదివి వినిపించండి

సెట్టి: (కమ్మ విప్పి ఇలా చదువుతాడు)

"శ్రీ శ్రీ చెంగమలదాసు మహారాజులుం గారి పాదసన్నిధికి, తమ ఆశ్రితుడు రాయసం వెంకన్న, అనేక దణ్ణములు పెట్టి, పంపుకొన్న విన్నపములు

ఏ కారణంచేతనో, కొద్ది రోజులకుండి, ఏకోజీ మహారాజా, మీపై మిక్కిలి కోపంతో ఉన్నాడు. ఎంత ఆలోచించినా, కోపకారణం తెలియవచ్చుట లేదు. తంజాపురముమీద దండు వెడలుటకు కూడా, ఏకోజీరాజా, ఆలోచన చేస్తున్నట్టు, నాకు తెలియవస్తున్నది. తమ ఆశ్రితుడను, క్షేమము కోరినవాడను, గనుక, ఈ వర్తమానమును ముందుగా, రహస్యముగా, ప్రభువులకు తెలియబరచుకొంటున్నాను.

ఇట్లు
తమ ఉప్పు కారముతో పెరిగిన
రాయసం వెంకన్న.
అయ్యంపేట.

దాది: ఏదీ? మరొక్కమారు చదవండి!

సెట్టి (మరల తాపీగా చదివి వినిపించును)

దాది: మోసం. పచ్చిమోసం.

సెట్టి: మోసమా?

దాది: అవును. తంజాపూరును మాచి, కమ్మ గుట్టి, ఆ జిత్తులమారి పన్నిన పన్నాగమే ఇది.

సెట్టి: అంత అవసరం?

దాది: రాయసం దళకర్త ప్రధానిగా తన్ను నియామకం చేయలేదని, తంజాపూరునుండి లేచి పోయి, ఏకోజీతో కలిసి, మరల కుట్రలు సాగించి నాడు ఈ దుష్టుడు వట్టి కుట్రపురుగు

సెట్టి: రాజా కొలువులో ఉద్యోగం శాశ్వతంగా తనకే ఉంటుందనీ, తనకే ఉండాలనీ, ఏ బుద్ధిమంతుడూ అనుకోడు

దాది: అది బుద్ధిమంతుని విషయం

సెట్టి: ఆ మాయల మరాటీవాళ్లనుకూడా, ఆయన, తన వలలో వేసికొన్నాడంటావా?

దాది: మరాటీల నేమిటి? ఆయన, యముడినైనా తన వలలో వేసికోగలడు.

సెట్టి: దొంగమరాటీ దండువాళ్ళకు, ఈ చదువులు ఒకరుచెప్ప నక్కరలేదు.

దాది: ఏమైనా కానీయండి. ఇది ఆ వియోగి వెంకన్న గారి కుట్రగాని, మరొకటిగాదు. కుట్రతోనే ఆయన, మన చిట్టిబాబును సింహాసన మెక్కించినాడు; ఈనాడు మరల కుట్రతోనే, మరోవిధం చేయ సంకల్పించినాడు. ఆయన చేతులలో తంజాపూరు సింహాసనం, బంతివలె, చాలా చేతులు మారింది.

సెట్టి: పోనీ, వెంకన్న గారి కుట్రయే అను గాక. మరాటీవాళ్లు మనమీద కోపగించే ఉంటారు కదా?

దాది: నిస్సందేహంగా. అంత కోపం ఆయన తప్పక కలిగించి ఉంటాడు.

శెట్టి. గాజుల చిద్విలాసం చేశాను, ఖాళీల చిద్విలాసం చేశాను, కొంప ముట్టుకోనదానికి? మరాటీ వాళ్ళను మనవీద బాగా కోపంవచ్చింది. ఇక మన కర్తవ్యం?

దాది : మన రక్షణ మనం చేసికోవటమే

శెట్టి. ఎలాగు?

దాది : పేనాబలంతో

శెట్టి అమ్మో! ఆ మరాటీవాళ్ళతో యుద్ధమే?

దాది అవసరమైతే

శెట్టి : బాబో; అది మనవల్ల కాదు. ఆ కొంప దొంగల గుంపుముందు మనం నిలవలేము మనం గెలవము.

దాది అలా అధైర్యపడకండి శెట్టిగారూ!

శెట్టి : అధైర్యమేమిటి? గుండె లబలబలాడి పోతుంటేను. మన మెంత? మన మట్టెంత? మరాటీ వాళ్ళతో కలపడటమా? చాలుచాలు. ఇక నీ ఆడ ఆలోచన కట్టిపెట్టు.

(భటుడు ప్రవేశం)

భటుడు : శ్రీ శ్రీ మహారాజులకు జోహారు ఎవరో ఒక అశ్వికుడు వచ్చి, ప్రభువుల దర్శనంకోసం, వాకిట వేచిఉన్నాడు

చెంగ లోనికి ప్రవేశపెట్టు

భటు రాజాజ్ఞ.

(వరవర వెళ్ళి, అశ్వికుని లోనికి తీసికొనివస్తాడు)

అశ్వి మహారాజులకు జోహారు

చెంగ (అశ్వికునితో) ఎవరు నీవు?

అశ్వి. రాయసం వెంకన్నగారు, ఒక వర్తమానం వ్రాసి, అతి రహస్యంగా, నిముషాలమీద, ప్రభువులకు అందజేయమని ఇచ్చినారు అదే ఇది (జాబుతీసి ఇవ్వబోతాడు)

చెంగ శెట్టిగారికి ఇవ్వు.

అశ్వి : (జాబు శెట్టిగారికి ఇస్తాడు)

చెంగ : (అశ్వికునితో) ఇక నీవు పోవచ్చును.

అశ్వి చిత్తం. రాజాజ్ఞ (నమస్కరించి వెళ్ళిపోతాడు.)

భటు : (అశ్వికుని వెంటనే వెళ్ళుతాడు).

చెంగ. శెట్టిగారూ! ఆ వర్తమానం చదువవలసిందండి!

శెట్టి (జాబువిప్పి చదువుతాడు)

"శ్రీ శ్రీ చెంగమలదాసు మహారాజులుంగారి పాదసన్నిధికి, తమ ఆశ్రితుడు రాయసం వెంకన్న, అనేక నమస్కారములుచేసి, అత్యవసరముగా వ్రాసి విన్నవించుకొను విన్నపములు.

ఏకోజీరాజు, తంజావూరిపైకి దండు సాగించదలచి సాగించినాడు ఆయన ప్రయత్నం, పెద్ద యెత్తున ఉన్నది ఏమికారణమో, తంజావూరు పేరుచెప్పితే, ఆయన, మండిపడుతున్నాడు ఈ రాత్రికి, ఆయన, దండుతో తంజావూరు చేరగలడు ఈ తరుణములో మీరు ఆయనయెదుట పడినయెడల, పెద్దమోసము జరుగగలదు కావున, మీరు, ఈ వేళ కుమాత్రం తప్పి, తొలగిఉండండి సింహద్వారం తెరచిఉంచి, అందరూ ఆయనకు కోటలోనికి స్వాగతం ఇచ్చేటట్లు ఏర్పాటు చేయండి నిమ్మళం మీద, నేను, ఏకోజీ మనసు దిద్ది, సమాధానపరిచి, మీకోట, మీ రాజ్యము, మీకు మరల వశముచేసి టట్లు చేయగలవాడను, మీ ఉప్పుకారముతో బ్రతికినవాడను, గనుక, నా బుద్ధికి తోచినట్లు, నా అదుర్దాకొలది, వ్రాసి విన్నవించుకొన్నాను

ఇట్లు
నమ్మినబంటు
రాయసం వెంకన్న,
అయ్యంపేట

శెట్టి (అని చదివి, భయంతో వణికిపోతూ) అమ్మయ్యో! ఇంకేముంది? కొంపమునిగింది! ఆ మరాటీదండువచ్చి పడినే పడింది.

దాది (గుండెలు బాదుకొంటూ) అయ్యో! అయ్యో! ఎంతమోసం? ఎంతమోసం?

శెట్టి : నేను చెప్పితే, విన్నారు? ఆ పాయల మరాటీ వాళ్ళని నమ్మవద్దని

దాది. (వణుకుతో) ఇప్పుడు ఏంచేద్దాం?

శెట్టి ఏంచేద్దామా? పరువుపోయిందే: ప్రాణా లుంటే, ఎక్కడైనా బలుసాకు తిని బ్రతుకవచ్చు. లేవండి! లేవండి!

దాది : ఎటుపోదాం?

సెట్టి: ఏమేమిటి? యుద్ధానికి సూటిగా. ఈ రాజ్యమునకును. ఈ యుద్ధాలునకును. (బిగ్గరగా) ఎవరక్కడ?

వెంక: సెట్టిగారూ!

సెట్టి. సెట్టి లేదు. బుట్టి లేదు. నీవు పట్టి పని పొసడవు వెంగళులదాసూ! ఏమీ ఎఱుగవు, ఉండు. మా తిప్పలు మేము పడతాము.

వెంక అది గాదు సెట్టిగారూ!

సెట్టి నీకేమీ తెలియదు. అలా ఉండమంటే! మరాటీవాళ్ళ చేతుల్లో పడి చావమంటావా? (మరల బిగ్గరగా) ఎవరక్కడ?

భటు: (పరుగున ప్రవేశించి) చిత్తం ఏమి సెలవు?

సెట్టి రొక్కం, బంగారు నగలు, రత్నాలు, సంచుల కెత్తుకొని, గుర్రాలతో వేయిమంది జనాన్ని, మూడు పల్లకీలను, తెరలు కేసి, సౌధం వాకిట సిద్ధంగా ఉంచు. పో త్వరగా పో.

భటు (చిత్తం. వెళ్లిపోతాడు)

దాది సెట్టిగారూ! మన మెటు పోవాలి?

సెట్టి (ఆలోచించి) ఆఁ! ఆఁ! తిరుచినాపల్లి వైపుగా.

దాది అమ్మయ్యో! అది మనకు శత్రుస్థానం కదా?

సెట్టి ఫరవాలేదు. తిరుచినాపల్లెను ఆనియున్న పాళెయపట్టులో, ఆ ఊరి దొర, రంగప్ప మాకప రాముడు, నాకు కావలసినవాడు ఆయన ఆశ్రయంలో మనం ఉండవచ్చును

దాది: అది మనకు క్షేమమే నంటారా?

సెట్టి. ఫరవాలేదు వర్తక వ్యాపారంలో అతనికి నాకూ చాలా లావాదేవీ లున్నవి. మన కేమీ మోసం జరగదు.

భటు (ప్రవేశించి) సర్వము సిద్ధమైనవి.

సెట్టి: సరే. నీవు త్వరగా పోయి,—కోట వాకిలి, రాజప్రాసాదంలో అన్ని వాకిళ్ళూ, తెఱచి ఉంచుమని, నగరంలో ఎవరూ కత్తి పట్టవద్దని, ఏకోజి రాజుకు ఘనంగా స్వాగతం ఇమ్మనీ,—రాజాజ్ఞ గా మహాజనప్రముఖులకు విన్నవించు.

భటు: చిత్తం (అని, చరచర వెళ్లిపోతాడు.)

(దూరాన ఫిరంగులు కాల్చిన చప్పుళ్లూ, జనాల కలకలం వినవస్తుంది)

సెట్టి: (విని వణవణ వణకుతూ) అదిగో, ఫిరంగుల చప్పుళ్లు మరాటీవాళ్లు వచ్చి పడనే పడినారు లేవండి! త్వరగా లేవండి!

(వెంగళులదాసును, దాదిని, చేయి పట్టుకొని, త్వరగా పక్కలలోనుండి లేవదీస్తాడు)

(ముగ్గురు ఒక్క పరుగున రాజసౌధం వెలికి వచ్చి, పల్లకీలలో ఎక్కి వెళ్లిపోతారు)

(వేయిమంది అశ్వికులు వారిని అనుసరిస్తారు.)

## దృశ్యం—4

[స్థలం—తంజావూరు రాజదర్బారు మహలు. సమయం—ఉదయం]

(మంగళవాద్యాలు, నగారా నౌబత్తుఖానా వగైరా, మ్రోగుతూ ఉంటవి ఏకోజిరాజు సామంత సచివాదులతో కొలువుకు వస్తాడు రాయసం వెంకన్న, ఖాను, పేష్వాయి, సయిదుసాహేబు, ఆయన ప్రక్కనే క్షాత్రిదుస్తులతో ముస్తాబయి, వస్తారు. రాజోద్యోగు లందరు బరాబరులు చేస్తూ ఉంటారు)

(పార్శ్వాన వేయిదీపాలు, పగలువత్తులు, ముత్యాలు, చంద్రజ్యోతులు, ప్రకాశిస్తూ ఉంటవి శుభసూచకముగా కోటవాకిట ఫిరంగులు మ్రోగుతూ ఉంటవి)

(వందిమాగధులు ఇలా పలుకుతారు)

వందిమాగధులు శ్రీ శ్రీ శహాజరాజ శ్రీ శివాజీ మహారాజ సహోదరా! మహారాష్ట్రాన్వయ పయః పారావార రాకాసుధాకరా! విస్తుల బాహు బల నిర్జితారాతిమండలా! నిజసైన్యవాహినీ ఖండలా! చాంద్ర కరుణారస తరంగ తరంగిత నిజహృదయాంతరంగా! శ్రితజనార్తిభంగా! జీర్ణ కర్ణాట రాజ్యభువన ప్రతిష్ఠాపన మహాదీక్షాదక్షా! తంజాపురరాజ్య లక్ష్మీ దృఢ స్వయంగ్రహమహోత్సాహ విలాసవిలసిత విభుల విజయా! రాజాధిరాజశ్రీ ఏకోజిమహారాజుల సార్వభౌమా! జయ! విజయీభవ! విజయీభవ!

ఏకోజి. (సింహాసనమును సమీపించి, ఒక్కమారు అందరినీ కలయజూచి, ఆసీనుడౌతాడు.)

మంత్రి సామంతాదులు అందరు (నిలు

చుండి ఉండి) రాజాధిరాజ రాజశ్రీ ఏకోజిమహారాజ ఘన సార్వభౌమా ! జయ ! విజయీభవ ! విజయీభవ !

(అని పలికి, రాజు కరసంజ్ఞతో తమ తమ ఆసనములలో ఆసీనులౌతారు)

పురోహితులు. (ఒక్క స్వరము తో) స్వారాజ్యం వైరాజ్యం మహారాజ్యమాధిపత్యం, పృథివీసముద్రపర్యంతాయా సమంతాయా ఏకరాడితి శతమానంభవతి శతాయుః పురుషః శతేంద్రియ ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి.

(అని ఆశీర్వాదములు పలుకుతారు)

(నృత్తగీత వినోదాదికములన్నీ పూర్తిఅవుతవి)

ఏకోజి ఈనాడు పర్వదినం. మీ అందరి ఉత్సాహబలముమీద, మేమీ తంజాపుర రాజ్యమును చేపట్టి, సర్వ ప్రజారంజకముగా పరిపాలన సాగించ దలచుకొన్నాము. ఈనాటితో తంజాపూరురాజ్యము లోని చిక్కులన్నీ తీరిపోయినవి

- కొలువువారు అందరు—జయ ! విజయీభవ!

ఏకోజి ఈ మహైభవమునకు కారణభూతులైన మీ అందరిని నేను అభినందిస్తున్నాను ఘన స్వాగతముతో, నన్ను సింహాసనమునకు ఆహ్వానించిన తంజాపురరాజకార్యముల వారిని, మిక్కిలి అభినందిస్తున్నాను

మంత్రులు: మహారాజుల మహానుగ్రహం

ఏకోజి అనాయాసముగా మా కీర్తి విజయమును సమకూర్చిన శ్రీరాయసం వెంకన్న నియోగిగారికి, ముఖ్యముగా మా సంతోషమును తెలుపుకొంటున్నాము

వెంక: ధర్మ సంస్థాపనమునకు కంకణము కట్టుకొని అవతరించిన అపరశివావతారము శ్రీ శివాజీ మహారాజుల సహోదరులు శ్రీ ఏకోజీ మహారాజులు మారాజులు కావటం మా అదృష్టం

ఏకో: వెంకన్నగారివంటి మహామేధావులు, ప్రజ్ఞాధురంధరులు, మాకు సహాయం కావటము, మా అదృష్టవిశేషం

వెంక శ్రీ శ్రీ ఏకోజీ మహారాజుల నిండు కొలువులో, ఈనాడు, ఈ ఇం ది రా మం దిరము, సాక్షాత్తు ఇందిరామందిరముగా ప్రకాశించుచున్నది.

ఏకో నేటినుండి తంజాపురరాజ్యము, మా మహారాష్ట్ర పరిపాలనము క్రిందికి వచ్చినది అయినప్పటికీ, ఇది మేము ఆక్రమించుకొనినది కాదు, కావలెనని కోరుకొన్నదికాదు, కాదు కాబట్టి, రాజకార్యములలో, మునుపు ఉన్నవారినే, ఆయా పదవులలో, అట్లే ఉండ నియోగించుచున్నాము.

కొలువువారందరు—మహారాజుల మహానుగ్రహమునకు కృతజ్ఞులము.

ఏకో తమ తమ ఆచారములలో, మాన మర్యాదలలో, మేమెన్నడు ఎట్టి అభ్యంతరము కలిగింపబోమని, తంజాపూరు ప్రజలకు, మేము, ప్రతిజ్ఞాపూర్వకముగా అభయమిచ్చుచున్నాము ఎవరి అగ్రహారములకును, అస్తిపాస్తులకును, దేవాదాయములకును అడ్డురాము.

కొలువు వారందరు—మహారాజులకు జయమగుగాక !

ఏకో: పూర్వపురాజుల వరవడులలో నడచి మేముకూడ తెలుగుభాషను, తెలుగుకవులను పోషించి, వారిచే క్రొత్తప్రబంధములను నిర్మింపించగలము. పూర్వ ప్రబంధములను, ఆదరించి, ప్రకటనలోనికి తీసికొనిరాగలము. మా రాజ్యము కదా అని, మా మహారాష్ట్రభాషను తంజాపుర ప్రజలపై రుద్దము

కొలువు వారందరు ధర్మప్రభువులకు జయమగుగాక!

ఏకో తెఱచి ఉంచబడి, సుస్వాగత పూర్వకముగా, మాకు అఖండ విజయమును సమకూర్చిన తంజాపూరు కోటవాకిలికి, మా సంతోష చిహ్నముగా, "ఫతే దర్వాజా" అని సార్థకముగా నామకరణము చేయుచున్నాము ఈనాటినుండి అది అట్లు వ్యవహరింపబడును గాక!

సభలో (హర్షధ్వానాలు)

ఏకో తమ రాజా చెంగమలదాసు బాలుడైన కారణమున, ఆయనను తక్కువ చేయక, కానుకలు, కరదీపం, మానిసేసి, తల యొగకట్టిన చుట్టుపట్ల పీఠులలోని సేనాపక్కీల నందరిని, జయ భయములమీద వశపరచుకొని, సారెగాండ్లను క్రొత్త కట్టులలోనికి గొనివచ్చి, సేను అంతా స్వస్థతను తీసికొనివచ్చుటకు

ప్పయ్య మరువుట యోగ్యతకమగును. పెద్దయైన అద
దయు యుద్ధముగా, అన్న యొక్క ధైర్యసాహసములకై
విశేష గౌరవము. దైవభక్తి కూడ విశేషముగా
నున్నట్లు తెలియుచున్నది కాని కొన్ని సందర్భ
ములయందు రామప్పయ్య కఠినాత్ముడుగా నున్నట్లు
కనబడుచున్నాడు దీనిని బలపరచునట్టి యొక కథ
'కొంగు మండలకతకం' అను తమిళ పుస్తకమున గలదు.

పన్నులుగా కప్పము చెల్లింపని హేతువుచే,
రామప్పయ్య కొందరు పాళెగార్లను కారాగృహమున
బంధించెనట. వారిలో ఆణూర్ 'సంబంద చర
క్కరై' అను పాళెగాడొకడు కలడు. అతడు తమిళ
భాషా పోషకుడుగా ప్రసిద్ధికెక్కెను. ఒకనాడొక
కవి బంధితుడై యున్న 'సంబంధ చరక్కరై'ను
సందర్శించి యతనిచే సన్మానితుడగుటకు యత్నిం
చెను. అప్పుడు తనయొద్ద ఏమియు లేకుండుటచేత
సంబంధ చరక్కరై తన భార్యను దర్శింపుమని కవిని
కోరెను. ఆమెతో కవి యీవిషయమును నుడివిన
వెంటనే, తన మంగళసూత్రమును కవికి సన్మానించె
నట. ఆ మహా యిల్లాలు! ఈ అద్భుతవిషయమును దళ
వాయి రామప్పయ్యకు తెలియజేసినవెంటనే పశ్చాత్
తప్తహృదయుడై దళవాయి సంబంధ చరక్కరై
సచ్చరిత్రమును కొనియాడుచు అతనిని బంధవిము
క్తునిగ జేసెను. ఇటులనే యుద్ధసమయములందు
రామప్పయ్య బంధితులను బాధించెనని అన్యత్ర
సూచింపబడుచున్నది

ఇక, రామప్పయ్య మరణమును గురించి విచా
రింతము. తిరుమలనాయని నాయకుని మరణమునకు
సంబంధించిన కథలవలెనే, రామప్పయ్య మరణమును
గూర్చికూడ కథలు పెక్కులున్నవి. సేతుపతితో
యుద్ధము కొనసాగించుటకుగాను రామప్పయ్య పాంబన్
కాలువపై ఆనకట్ట కట్టి, జడైకదేవునితో యుద్ధము
చేయుచు వీరస్వర్గము నలంకరించెనని కొందరు
చరిత్రకారులు విశ్వసించుచున్నారు. జడైకదేవుడు
గావించిన 'చేతబడి' ఫలితముగా రామప్పయ్య మర
ణించెనని కొందరు నుడువుదురు. విషప్రయోగము
వలన మరణించెనని మరికొందరి నమ్మకము. ఇటుల
రామప్పయ్య మరణమును గురించి భిన్నాభి
ప్రాయము లున్నను, ఇతడు క్రీ. శ. 1658 ప్రాంత
మున మరణించి యుండవచ్చునని నుడువవచ్చును. ఏల
యన, యుద్ధమున మరణించిన రామప్పయ్యకు పిమ్మట,
అతని అల్లుడగు శివరామయ్య తిరుమలనాయ
కునిచే దళవాయిగ నియమింపబడెను. శివరామయ్య
కును, సేతుపతికిని జరిగిన యుద్ధములో సేతుపతికి
పరాజయము కలిగినది కొన్నాళ్ళు జడైకదేవ—సేతు
పతి మధురలో కారాగృహమునందుండి, తిరు
మలనాయనివారి అనుగ్రహము వల్ల
సంపాదించుకొని మరల రామనాథపురమును
పరిపాలించి, 1646 సంవత్సరమున జడైకదేవ సేతు
పతి తన తమ్ముడగు 'తంబి'చే హత్యగావింపబడినట్లు
రామయ్యగారి అమ్మానై నుడువుచున్నది. కనుక, రణ
రంగమునందే రామప్పయ్య మరణించెనని నుడువుట
సమంజసముగ కన్పించుచున్నది.

పయి నుదాహరించిన విషయము లన్నియు
రామయ్యగారి అమ్మానైలో పేర్కొనబడినవి. ఒక్కొక
చోట రామప్పయ్య 'పులిరామయ్య' అనియు 'రాక్ష
సులను సంహరించిన రాము'వంటివాడనియు ప్రస్తు
తింపబడినాడు. రామప్పయ్య, సేతుపతులకు జరిగిన
యుద్ధము మనోజ్ఞముగ చిత్రింపబడినది. ఇటుల
రామయ్యగారి అమ్మానై రామప్పయ్య జీవితవిశేషములతో
గాక, ఆనాటి సాంఘికరాజకీయాది పరిస్థితులనుగూడ
కండ్లకు కట్టినట్లు తెలియజేయుచున్నది. కావున,
రామయ్యగారి అమ్మానై చారిత్రక దృష్ట్యా అమూల్య
మగు గ్రంథమనుట నిర్వివాదాంశము. ఈ గ్రంథ
మున నభివర్ణితమయిన రామప్పయ్య గాథ కూడ తల
వానికిని వంటిదని నుడువుట అత్యుక్తి కానేరదు.
ప్రతిభాశాలియైన దళవాయి రామప్పయ్య జీవిత
చరిత్రము తెలుగువారికి మాత్రమేగాక దాక్షిణాత్యుల
కెల్లరకు చిరస్మరణీయము!

---

# విరహి

శ్రీ కోదూరి ఉమామహేశ్వరం

నామనమెల్ల నందనవనస్థిత కోమల పారిజాత మా
లామధురాత్మకంబయి నిరామయభావ నిలీన గోపికా
కామనమై కృశించెడినికంపిత ఖండిత నాయికా మృగా
క్షీహృదుశయ్యయై పరిమళించెడి గంధవు పచ్చిముద్దయై

వన్నని యేటివంకల పిసల్లు పిసల్లు తురాయిపూలు పూ
యన్నజరైన తెక్కతుదిజుంచుల సోలిన పాలపిట్ట శే
వన్నెలవైన నాయెడద భావుకతా మధురోహ లెన్ని యో
చిన్నెలు గ్రుమ్మరించుచును చేష్పడిపోయె రసాపకర్షముల్

సుమధుర సాంధ్యరాగముల శోభలు చిమ్మిన యాకసంబుపై
గుములుకవచ్చు రక్తిమను గూర్చి పసిండివలెన్ భ్రమించితిన్
విమలినమైన జీవితము వెక్కసమై తటిలీపు లారి మై
కము విడిపడ్డ నాకునయి క్రమ్ముకువచ్చె విషాద మేఘముల్.

సలలిత పుష్పకోమల వసంత సదృతుము యౌవనంబు , నా
వలపుల పంట యీవనెడి భావన చేయుచు నున్ననాకు ని
ర్మల మధురోహ సమ్మిళిత రాగవిపంచీమృదునాద సంస్వరం
బులు విన గోర్కెపుట్టెడినిపో - యెడశేక నహర్నిశంబులున్.

కమ్మని పండువెన్నెలలు గాయు దినమ్ములు పోయి కృష్ణప
క్షమ్మిక దాపురించునని సారెకు సారెకు నాయెడందలో
గ్రమ్మి విషాద మేఘపటలమ్ముల నిండిన చిమ్మచీకటిన్
వమ్మయినట్టి నాప్రణయవాంఛలకై తపియింతు నోసఖీ !!

మదరని ప్రేయసీ ప్రణయ ముగ్ధ మనోహర ప్రేమగాథ నా
మది వదలించుచున్నది సుమా వినుమా యనుమాన మేలనో
సుదవతి ! నాటి నీమధుర మంజుల ప్రేమరసార్ద్రమూర్తి యొ
ప్పిదమయి నేటికిన్ మధురవీక్షల గన్నుగృతార్థు జేసెడిన్

భావజుని చిత్తవృత్తి భావముల నెఱిగి
యుత్తమ గృహస్థ ధర్మంబు వృత్తమెఱిగి
మదన సామ్రాజ్య వైభవాస్పదుల మగుచు
నాకసంబున విహరింప నభిలషింతు.

---

# తమస్సులో తపస్సులు

✱

శ్రీ మునిపల్లె రాజు

మా స్వగ్రామం అటు జిల్లా ముఖ్యపట్టణానికి యిటు తాలూకా ముఖ్యపట్టణానికి దగ్గర్లో, గ్రాండ్ ట్రంకురోడ్డు బస్సుమార్గంలో వుంటంలో మా గ్రామీణ నాగరికతలో చాలా పెద్ద మార్పు వచ్చింది క్రమ అనుకోకుండా మీరు మావూరికి ఒక్కసారి దయచేస్తే, యీ నాగరికతను బరోమీటర్ మీద కొలిచినట్లు కొలిచి చూడవచ్చుని మనవి చేస్తాను. ముచ్చుకు ఒకటి రెండు వుదాహరణ లిచ్చినా మీరు సహించగలరని నమ్మకొను. వెనక మా గ్రామానికి గ్రంథాలయోద్యమాధ్యక్షులు వచ్చి వుపన్యాసాలు దంచినప్పుడు వచ్చిన వుద్రేకంతో పదిమందిమీ కూడ బలుక్కొని ఏ స్థలంలో పెంకుటింటి గ్రంథాలయం స్థాపించాలనుకున్నామో, ఆ పవిత్ర స్థలంలో నేడు భూషయ్యగారి చిన్న కాఫీ హోటలు వెలిసింది. మా ప్రెసిడెంటుగారు (వీరికి సంకీర్ణంబరమా నచ్చు) సహకారసంఘం పేర్లు మోసు చేసి, వారి స్వంత చిత్రాలో జమకట్టిన పూర్వం, మేము కట్టించదలచుకొన్న దాబాయిల్లు గ్రామ సహకార సంఘస్థలంలో మొన్న మధ్యనే నేలా సినిమాహాలు వచ్చింది. ఇంకా కావలిస్తే, మా గ్రామంలోకూడా రోజాపు యాక్టైసైగా బీజాలు సిగరెట్లు పెట్టెలా, వారానికి దజనుకుపైగా కొత్త చిట్లపేక పెట్టెలూ కలిసిపోతూంటాయంటే నమ్మండి అంతేకాదు, గత చరిత్రలో మా వూళ్లోని రెండు పార్టీలవారు ఏ విషయంలోనూ ఏకీభవించి వున్నట్లు ఎవరైనా వృద్ధులకు కూడా జ్ఞాపకం లేదు. కాని మొన్న మధ్యనుండీ, అంటే గ్రంథాలయం కట్టవలసి వున్నాదులు పైకి లేవకుండా చేసేందుకు పెట్టిన అర్జీల్లోనూ, ప్రజల పేర్ల ధనాన్ని హోటలు పెట్టిలో కట్నంగా అడ్డం పెట్టుకొన్న ప్రెసిడెంటుగారి అరెస్టు తప్పించటంలోనూ, మా ప్రాథమిక పాఠశాల ప్రాథమికోన్నత పాఠశాలగా మారకుండా అడ్డపడా [illegible] కొన్న నాగ్రతలోనూ — తరతరాలనుండీ తన్నుకున్న ముఠా కక్షలు యిప్పుడే మాయమై పోయాయని నేను గర్వంగా చెప్పగలను.

ఇటువంటి మా స్వగ్రామాన్ని మీరు పల్లెటూరని గాని, బస్తీ అని గాని అనలేరు. ఈ బస్తీ, పల్లె రెండూ కాని మావూళ్లోగూడా ధర్మదేవత ఒక పాదంమీదయినా నడుస్తున్నదని నేను విన్నవిస్తే మీరు ఆశ్చర్యపోయేందుకు పనిలేదు! మా పదునెట్టి బజారు పురాతన నాగరికతకు శ్రీరామ మంటపం ఆట పట్టు.

ఇక్కడ మీకు ఒక చిన్న విషయం మనవిచేయాలి మీరు సంవత్సరంలో యెటువుంటెట్లా మారుతుంటారో, మా శ్రీరామ మంటపంమీద సీజన్లు గూడా అట్లా మారుతూవుంటాయి. మొన్ననే గడిచింది. వులీ పేక జూదం సీజను అంతకు ముందు సీజను చిట్లపేక సీజను ప్రస్తుతం జరుగుతోన్నది— పురాణ కాలక్షేప సీజను, వర్తమానమైన ఈ పురాణ కాలక్షేప సీజను పుణ్యమహాత్మ్యంతోనే మన కథగూడా ప్రారంభం అయింది ఈ సీజను ప్రారంభంలోనే మా ఆచార్యులవారు "ఒరే, మనవూళ్లో ధర్మం నాలుగు కాళ్ళమీద సంచరించటం లేదని ఎవర్రా అనేది?" అని నాబంటి సంస్కరణ వాదుల్ని సవాల్ చేసి, మందలిస్తూంటం కద్దు

* * * *

ఆరోజున శ్రీరామ మంటపం అరుగులమీద స్థల పురాణ కాలక్షేపం నిరాఘాటంగా సాగిపోతున్నది శీర్షులవారు మంచి పండితులే గాకుండా, కొంచెం సంగీత విద్యలోగూడా ప్రవేశం గలిగిన వారు కావటంలో వారి శిష్యవర్గంలో ఆ బాల గోపాలమూ వున్నారు.

శీర్షులవారి యెదురుగా మావిళ్ల భక్తి విశేషం వర్ణం అనీభరిపోతుంది. వారికి ఎదురుకోళ్లగా [illegible]

ముఖ్యమైన రైతువర్గం ఏర్పాటైవుంది వారికి పడి పక్కగా లేదా దిక్కు భక్తులూ, యీ మీరథ స్త్రీ శ్రేణికి పరగా, పైన చెప్పబడిన బాలబృందమూ, వున్నవి. అందరికన్నా పరక శ్రేణిలో, మట్టి రోడ్డుకు అందుబాటులో ఏర్పాటులో యీ బాల భక్తుల తమ వర్గ యోగక్షేమాల్ని ఎంతటి పురాణ శ్రవణకాలంలోనైనా ఏమరి పాటుగా విస్మరించే వాళ్లు కాదని మాకు గ్రహించవచ్చు

తీర్థులవారు చదువుతోన్న శ్లోకాన్ని సంపూర్తి చేసి, దాని అర్థ తాత్పర్యాలు పలకకుండానే ఆవులించి, తెరిచిన నోటిలోకి దగ్గరలోనే వేచి వున్న దోమలదండు ప్రవేశించకుండా చిటికవేసి, ఒక్క తాత్కాలిక క్షణం శిష్యకోటికంత తమ కరుణారస వీక్షణాలు ప్రసరింప జేశారు అప్పటికి ప్రథమ శ్రేణిలోని వికంతు కోటిలో—తిరుపతి కొండ స్థల మహాత్మ్యకథ ప్రతి నన్నగిల్లి కోడళ్ళ మంటపకతాన్ని వదిలించే వివిధోపాయాల అన్వేషణకు ప్రాధాన్యత హెచ్చింది. ఆ వర్గంలోనే అక్కడక్కడ చిలకరించినట్లుగా వున్న వలుసరైదుగురు కోడళ్ళలో కొత్తంగా వచ్చిన తెలుగుసినిమా చిత్రంలోని తారదొక్క వర్ణనలో అభిప్రాయ భేదాలు వచ్చినాయి. బసవయ్య చౌదరిగారూ, వారి చెట్టు కింది ప్లీడరు అన్నాయి నాయుడూ, బట్టలతో పాష్యల సీతారామయ్య—వారి తరువాతి కోర్టు లిటిగేషన్ గురించి మాస్టర్ ప్లాన్ వేస్తున్నారు. తీర్థులవారికి అపారమైన లోకానుభవముంది వారికి లౌక్యం వంశపారం పర్యపు సంపదగా వస్తోంది

వారు శిష్యకోటిలో అధిక సంఖ్యాకుల తత్తు జాభి రుచుల్ని గమనించినవారై, మరుక్షణమే, తొంటేమన్న వెండి పొడుంబుర్రను పదిమంది ముందూ ప్రదర్శించి, అందులోని "సమ్మోగానంద అభినర్ల మద్రాసు నస్యాన్ని" కొంచెం అసామాన్యమైన పెద్ద పట్టులో దట్టించి, తత్ఫలితంగా వచ్చిన బ్రహ్మానందంలో ఒకక్షణం లీనమై, తెలివి తెచ్చుకొని, స్థలపురాణ గ్రంథాన్ని మూసి, తమ శిష్య సంతానాన్ని లౌకిక సమ పార్థనలో ప్రవేశపెట్ట దలంచినవారై—

"విన్నారా! కాంతమ్మగారూ! కోమటి సురవయ్యకు బజారుగా వుందట" అన్నారు. (అరోజా భిక్ష, ప్రసాదం వంతు కాంతమ్మగారిది)

సురవయ్య పేరు వినగానే పెంపకాళ్ళ పెత్తనాలో "బెల్లం" "బెల్లం" అని అస్పష్టపు మనసులు వినిపించినై చాపలున్నవాళ్లలో వున్న సురవయ్యకూ బెల్లానికి అవినాభావ సంబంధం వున్నా ఈ గుసగుసలు తీర్థుల వారికేమీ నచ్చలేదు.

"గతం గతః అన్నాడు గదండీ శాస్త్రకారుడు? చనిపోయేవాడి సుగుణాలు మాత్రమే లోకం చెప్పుకోవాలనటం ధర్మమేగదా!" అని లౌక్యంగా వారు శిష్యకోటిని మందలించారు తీర్థులవారి మనస్సులోవున్న విషయం పెద్ద రహస్యమేమీ గాదు మా గ్రామంలో శ్రేష్ఠమైన బెల్లం పుట్లకు పుట్లు పండుతుంది కాని నిరుటి సంవత్సరం మూడునెలల పాటు, కలుకంటే ఏమిటో ఎరగని మావూరికి గూడా బెల్లం క్షామం వచ్చింది చివరకు పెద్ద మ్యాలు మాష్టరుగారు గూడా తులం బెల్లంకోసం గడప గడపా తరగకలసి వచ్చింది "సురవయ్య కొట్లల్లో మురిగిపోతున్నదని" కొందరూ, "వంకమసీడు చౌదరి, సురవయ్య కలిసి దొంగతనంగా అమ్ముతున్నారని" కొందరూ విసుక్కొన్నారు ఏమైతేనేం కరువు కరువుగానే వెళ్లిపోయింది

ఇంతలోనే సర్వాంతర్యామి అయిన వరసమ్మగారు "బరువేమిటి స్వామీ' పొద్దుకే కిందకెళ్లారుగా" అన్నది

"మహాండాలి కాదండీ—పుణ్యాత్ముడు ఏ జన్మలోనో యింత చేసుకు పుట్టాడు శివాలయానికి ధ్వజస్తంభం దానం చేయించాడు కదండీ" అని తీర్థుల వారు మరోసారి ఆవులించారు

ఈ సందర్భంలో తీర్థులవారు ఒక విషయం మరిచిపోయారు సురవయ్య వేయించిన ధ్వజస్తంభం కలప చాలా పాతదనీ, గాలికి నిలవదనీ ఓంకారం వాస్తు శాస్త్రజ్ఞుడు చెప్పినట్లే, అది మొన్నటి రాత్రి కంలో విరిగి కూలిపోయింది. ఈ మాటలు అప్పటి దాకా వింటూ కెళ్లంకొట్టిన రాయికలె కూర్చున్న సురవయ్యగారి జ్ఞాతి కామయ్య సంతోషం లోపల దాచుకొని "పొద్దు తిరక్కముందే ప్రాణం పోయిందం దండీ" అని చల్లగా జారవిడిచాడు.

సభికులందరూ "నారాయణ" "నారాయణ" అని సత్యం పొరపాటుకి పశ్చాత్తాపరణ చేశారు.

"ఏరా - పిలుపుగా ! నువ్వు వచ్చిపోయా కంట నిజమేనా ?" అని తను అడిగాడు

వాడు నవ్వి—"అవును—అబద్ధమేముంది ! నేను గనబట్లా !" అన్నాడు.

"అరేయ్, ఎందుకు జబ్బాపురా !"

"వచ్చినోళ్ళమీద పైడలేయమంటే !"

ఈమాటతో యాదవులికి జాగ్రద వస్థవచ్చింది. మళ్ళి దెయ్యాలలోకంనుండి భూమ్మీదకు దూకినట్లయింది. భయంతో అర్థంలేని అరుపులు అరవసాగాడు. ఈ భయంకర శబ్దానికి గుళ్ళో ధర్మకర్తల ఏకొంట్లయిన గబ్బిలాలు లేచి చెదిరి అటూ యిటూ ఎగరసాగినాయ్ యాదవులు వినాయకుణ్ణి కావిలించుకొన్నాడు కాని గబ్బిలాలు తలమీదనే రెపరెప కొట్టుకొంటున్నాయ్ శిథిల దేవాలయపు మొండి గోడలు చీకట్లో ఆకాశం మొత్తగా పెరిగి పోతున్నట్లు యాదవులికి కనిపించింది గుడిపచక చింత చెట్లమీదనుండిగూడా ఏవో శబ్దాలు వినిపించినై నిజాని కది వానశబ్దం

వినాయకుడి రక్షణ వదిలి యాదవులు బయటకు పరుగు లంకించుకున్నాడు ప్రాణభయంతో "అమ్మో, ఓరిబాబో ! నాయినో ! బాబో !" అని అరుచుకుంటూ బయట ఎదురుదెబ్బ తగిలి బొక్క బోర్లా పడి లేవబోతూండగా, తండ్రి వానలో గొంగళి కప్పుకొని తనను వెతుక్కుంటూ వచ్చాడు

రామదాసు చక్కయాదవుల్ని పట్టుకొని—

"ఏరా ! ఒళ్లు కాగిపోతున్నది జ్వరం వచ్చిందా ?" అని అడిగాడు

* * * *

యాదవులు జ్వరం మరునాడుగూడా తగ్గలేదు రామదాసు మంగలి వైద్యుణ్ణి పసరు అడిగేందుకు వెళ్లాడు యాదవులికి రాత్రి అనుభవం కలో నిజమో అర్థం కాలేదు. అర్థంకాక—"అమ్మా, ముక్కు పిలుపుగాణ్ణి చూశావే ?" అన్నాడు తల్లితో

అచ్చమ్మ కొంచెం ఆశ్చర్యంగా కొడుకుకేసి చూసి—"నీకేమి రా పిచ్చి ? పిలుపుగాడు ఇచ్చి [illegible]" అని సమాధానం యిచ్చింది.

"కాదే ! నిజమే !" అని యాదవులు [illegible] గాని [illegible] మాట్లాడలేదు ఆ మగతలో మళ్లీ ముక్కు పిలుపుగాడు కనిపించాడు.

ఆ మత్తు మత్తు రాత్రికిగాని తెలియలేదు యాదవులికి జ్వరం పెరిగిపోతున్నది. వాడి ఒంటి మీద ఏ ఇద్దా నిలవటంలేదు. ఈ ఒక్కరోజు జ్వరానికే చిక్కి శల్యమైపోయాడు రామదాసు ఒకటికి రెండుసార్లు మంగలి వైద్యుడిచుట్టూ తిరిగాడు తండ్రి జాల యిస్తూండగా యాదవులు జాలిగా చూశాడు

"ఈత గొట్టావా కూర్చు కొలతలా ?" అని రామదాసు అడిగాడు

"లే దే ! ఉ హూ !"

"మరి జ్వరం దేనికిరా ?"

యాదవులు సమాధానం చెప్పక, కళ్లు మూసుకున్నాడు. కొంచెం సేపటికి కళ్లు తెరిచి—

"అ య్యా !" అని తండ్రిని పిలిచాడు.

"అయ్యా సచ్చినోళ్ళమీద పైసలేయమంటే తిరిగి బతికినోళ్లు వస్తారా ?"

"నువ్వేయమన్నావా ?"

"అవూ ! ముక్కు పిలుపుగాడు"

"పిలుపుగాడికి చన్నిపాత జొరంవచ్చి ఒచ్చింది"

యాదవులికి యీ సమాధానం ఏమీ నచ్చలేదు. నచ్చక తండ్రి బయటకు పోవటంమాని తల్లిని పిలిచి అదేప్రశ్న వేశాడు పిచ్చిఅచ్చమ్మ "నిజమే" అన్నది.

నాలుగురోజులు గడిచినా జ్వరం తగ్గుముఖం చూపలేదు. రోజురోజుకూ రోగి చిక్కిపోతూన్నాడు రామదాసు, కొడుకు పక్కమంచపు కోళ్ల గట్టున గూర్చొని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు. అది చూచి యాదవులు—"అ య్యా" అని పిలిచాడు. కాని ఏదో అవ్యక్తంగా, హస్తాల్లో గుర్తులు చూపాడు.

"అయ్యా. కో...ప. మా.. ?"

"ఉ. హూ" అని తలూపాడు రామదాసు ఏమీ అర్థంగాక.

"[illegible] ?"

"ఏమిటి ?"

"కోమటి గురవయ్యమీద పైడలు"

"అరి పిచ్చిదనకానా, ఏమయిందే ?"

"కా దు "

"మ రి "

"బుక్కా పిలుపుగాడు"

రోగి పెద్దగా అరిచాడు. మూలిగి మగతలో తిరిగి పడిపోయాడు

* * * *

ఎనిమిదిరోజుల జ్వరానికి అంతులేదు. ఎనిమిదోరోజున యాదవులు తన స్నేహితులు సింగణ్ని, మాణిక్యం కొడుకు యల్లమందను, యానాది ముల్లిగాడిని, కాపుల పిల్లాడు సీతన్నయ్యనూ పిలిపించుకొన్నాడు

"అ రే య్ యల్లమందా నువ్వే చెప్పింది నిజంరా !"

"ఏంది ???"

"బుక్కా పిలుపుగాడి మాట"

యల్లమంద నవ్వి "అబద్దం అబద్దం నిన్ను బయాలు పెట్టేందుకు చెప్పాన్రా "

యాదవులు జీవంలేని గొంతుతోనే, భారి అనుసుంచి మాట్లాడాడు

"నిజంరా ఆ డు. వాగ్గవబడిచెప్పిం డు "

పిల్లలందరూ దిగాలుపడి చూశారు. అందరికీ కళ్లనీళ్ళు వచ్చినై వంకాయల మాణిక్యంకొడుకు యల్లమంద పెద్దగా ఏడ్చాడు

మళ్ళీ యాదవులు మాట్లాడాడు.

"అ రే యాదో .. పొద్దురా .. నేను బుక్కా పిలుపుగాడిదగ్గిర కెళ్తాన్రా ! నా కాబుకు చెప్పి, నేను ఇచ్చినాక పైసలు ఇల్లిపిస్తాను. యల్లా ! నువ్వేయుకోక సింగడికియ్యి, సీతకుకయ్యకు ముల్లి . గాడికి కొరిదగంగా యియ్యరా "

యాదవులికి మళ్ళీ తెలివి అర్ధరాత్రికి వచ్చింది రాముదాసు కొడుకుమందం వదల్లేదు.

"అ య్యా నేను ఇక్తే . సురవయ్యకు ఇల్లి వట్లు పైసలు ఇల్లుకావు గా "

ఈమాట రాముదాసు బావురుమని ఏడ్చాడు ఆరాత్రి భయ్యన తెల్లవారింది రాత్రంతా యాదవులు కలవరిస్తూనే వున్నాడు జ్వరం గంటగంటకూ ముదిరిపోయింది మంగలి వైద్యుడు గరళం పోసే ఏర్పాటుచేసి, పన్నెండేళ్ళ యాదవులి మాడుగీచి పట్టువేస్తున్నాడు కాని వంకాయల మాణిక్యం కొడుకు యల్లమంద భవిష్యత్ చెప్పినట్లు తొమ్మిదో నాటికల్లా యాదవులు యిహలోకయాత్ర చాలించాడు

* * * *

ఆరాత్రే గ్రామస్థులు రాముదాసును, వచ్చిపోయిన సురవయ్యసెట్టి కొట్టుకు కన్నం వేస్తూండగా పట్టుకొన్నారు

దొరలందరూ దొంగను అడిగారు—

"ఎందుకుచేశావ్ దొంగతనం ?"

రాముదాసు అన్నాడు సమాధానంగా—

"వాకొడుక్కు చెర్వంమీద పైసలకి"





# సత్యాగ్రహం

★

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

పూర్వం
ఉంటేది మనుష్యుల్లో సత్యాగ్రహమొకటి
అది దేవి కరాల్లో
ఒక కరవాలంగా నిలబడి
అస్మి నడచుదారుల్లో పొంచిఉన్న దౌర్జన్యాన్ని
సమూలం చెండాడ్తూ
ఆ దొంగతనపు దాగుడులో
మోసపుసీమల చెల్లాచెద రొనరించుటలో
ఉపయోగపడే దప్పుడు

అసిపిడిపై పిడికిలి దేవి బిగించిందా
ఆ దారకలోక దురాచారాసుల
తమకుటి దట్టపుచీకటి భటులను
వదలి కదలిరా భయపడి పక్కా వొకమూల.

కాని
ఈరోజుల్లో దుష్టశిక్షణార్థం
దేవిదాడి సలిపే అవసరమున్నప్పుడు
చూశారా ఆ ఆయుధమెవరన్నా ?
ఊరక నిలబడి చూస్తున్నది
దేవి నేడు అన్యాయాన్ని !

కళ్ళు జిగ్గుమనిపించే అమర కాంతిపుంజం
ఆముఖసీమను
వెల్లువలై ప్రవహించకపోవడం వల్లను—
దౌర్జన్యపుధిక్కారం అణగారించి
దాన్ని నివాసనీడ లేకుండా
మింటికెగబాకే కలుషగుంపులు
శాతఖడ్గ ప్రకాశమానశస్త్రం
ఆ శిష్టజనావన హస్తాల్లో.

నిలవకుండడం వల్లను
ఈ పాతాళ పిశాచుల వికృతాననాలు
నిగ్గింకే లేకుండా
ప్రతిద్వంది మొగం చూసి
పరిహసింప సాహసించు !

ఆ మునుపటిరోజుల్లో తొడిగిన ధర్మకవచమే
ఆనాటి శిరస్త్రాణమె
ఈనాడూ అంగాన ధరించి
సదాసిద్ధంగా ఉన్నదిదేవి
కాని నిర్దాక్షిణ్యంగా
కాపట్యం మొదలంటా పెల్లగింప
ఆమె అస లశక్తురాలు—
సత్యాగ్రహం లేదుజగతి .
లేదు దేవిచేతికత్తి

## 2

ఓ దివ్యకృపాణం !
మరొక్కసారి మా దేవి కరాలకు రావా ?
పరమాత్మనిబంధై ఆమె మరల
మా భూముల్లో విచ్చగ పెరిగిన పాపపుపంటను
మొదలంటగ తెగగోయగ ?
ఓ అమరశక్తి సంకలితాగ్రహమా !
సత్యరౌద్ర జనితాసీ !
సృష్టిసమస్తం
మహాపూర్ణమై ఉన్న విధంగా
మహాగంభీరగోళంగా ఉన్నప్పుడు
సర్వసహా ప్రాణకోటియోగాల్లో
ఆనందానికి వ్యతిరిక్తంగా ఉన్న ప్రతిదాన్ని

సమూలముగ నాశనంచేసితోలి
భగవానుడు స్వర్గాలు సృజించిన సమయంలో
క్రమవిహీనముగు విలయ ప్రకృతిపయి
దాడివెడలి పోసలిపి
ఆ మహాగ్నంనుండి
అనేక పవిత్రమండలాలూ
పితికారా తరళపాళీ
సృష్టించావు గదమ్మా!
మూసివ విశస్త్రాగారంలో బంధీవిష్వకు?
నీ పిరి విశతి కవద్వారలు త్రుప్పెక్కినవా?
ఓ సత్యరౌద్ర జనితాసీ!
అమరశక్తి సంకలితాగ్రహమా!
ఆ క్రూరపిశాచుల వక్రపతాకల ఔద్ధత్యం
ఎదిరింపగలిగేవాడీ, సత్యాగ్రహశక్తి వేడీ,
సుషుప్తై పోవడాన్ని
దుష్టశక్తు కాయున మేదీ లేకుండా
ఇన్నాళ్ళై అసహాయగ నిలబడి ఉన్నదిజేవి
ఆమెళలి కదలాడ్తూ
మాపాలాల పరిశుభ్రం చేయగరావా?
మహారౌద్ర భారంతో తన దోర్దండాలూగులాపి,
తనచుట్టూ విసిరే గాలివింపి
జేడిపొగల సిగలెగయగ,
మరల పెదలనీ మహోత్సాహం
ఆపెం మనస్సీములో!
పరమప్రభు క్రోధాలు, బృహద్వ్యూహ్నాలు,
మరల పొదలనీ ,రాతలంలో!
ఓ సత్య రౌద్రజనితాసీ!
ఆమరశక్తి సంకలితాగ్రహమా,

### 3

ఆరోజుల్లో
మానవుని మనస్థలం
పవిత్రపీఠగా ఉంటేది
శేరిమాసరాని తెల్లదనంతో
జలిగే పెద్దమంటలో
విరుదగ కదలుతు, సుళ్లుతిరుగుతూవచ్చే
ప్రళయానిల సంఘాతాల
భయంకర దంష్ట్రయాత్రలంటే
గుండెల్లో చెదురగుటను
దుష్ట పరశకస్తులు
ఆ పవిత్రమందిరం గడపే త్రొక్కుదలుస్తే
అతి జాగ్రత్తగ నడిచేది
కానీ ఇపుడిప్పుడు
సత్యాగ్రహశక్తి అసలు
యుద్ధానికి సంసిద్ధంగా లేకుంకుటవల్లను
ఆ రాక్షసశక్తులు
పట్టపగలె పాలిస్తున్నాయ్ ధరనంతా.
విచ్చలవిడిగా విజ్జుబీగుకూ
మనుజాని హృదయా న్నాక్రమించు కొంటు
న్నాయ్!
ఆ పదాల కదలికలను
దొంగచాటు దనంలేదు.
రకరకాల వికృతికకటాల చక్రాల్తో
మట్టేసిన మరదమట్టిలా
నేడా అసహాయ మనస్థలమంతా
తమ ఉన్మత్త పదాల అర్థహీన ప్రచలనాల.
ఎసత్రొక్కుడి పెసత్రొక్కుడి చేస్తూ
ఆ మార్దవమంతా మాపేస్తున్నాయ్!
అమరకాంతులేవో
నిరంతరం నంయూనే దారులతో,
చలువలనొలికే గాలులతో,
భగవన్మందిర మే అనుభ్రమకలిగించే పక్షులతో,
అమరుల అమృతపు విందులతో కలకలలాడే
రాత్రులతో,
అతి సుందరమౌ మానవు మేధా వాతావరణం
చూసిసహింపగజాలక పోయిందా నారకపాతక
బృందం
కాపట్యపుటన్నులను రగుల్కొల్పి,
కంజాయలతో భయంకరంగావుంటే సంజల్లో
పొగమారిన అసుభత్వంనిలబెట్టి,
కాళమేఘపటలాంధతమంతో
సర్వాన్నీ ఆవరించి,
పగటివెలుగు మాయచేసి
తమ కనుకూలంగా ఉంటే వాతావరణం
సృష్టింపగ మొదలిడిందా అసురశక్తిగణం
మనుజామనకు మిన్ను మీద
ఇసుకతుపానులు మబ్బులు
విసువగ వేలాడచేసి

కుటుంగెలుపు పొందాయని!
నదుని ఆ వేళపుటాలోచనాతిరస్కారిణులపై
ప్రళయపువల్లని నీడల జాడలెరో కనరావా?

## 4

కాంతిదినకరకాంత మనోల్లాసంతో పాటలుపాడుతూ
మాలీపని చేసిన ఈ మానవజాతి వనమాలాగున
పాడవటం చూసి దేవి ఎన్నాళ్లుసహిస్తుంది?
హద్దులేని అహంకారంతో మిన్నూమన్నూ గనకుండా
తిరిగే రక్కసిమూకలు నారక పాశవికసైనికులు
కరకువవు టడుగులతో వ్రశ చిక నృత్యంతో
మెత్తని విరిరేకులు నిండినదారులు కసగ్రొక్కుడు
చీడపురుగుల గుంపుల్లా తోటంతా ఆక్రమించి
నాశనం వెదజల్లడాన్ని దేవింకెన్నాళ్ళోర్వగలుగుతుంది?
ఓర్వలేని చేయగలదు?
మూర్ఖపు పేరాస,
స్వార్థం
మౌఢ్యం,
గోడలైన
నీచపు బంధాలదొడ్డిని, ఊపిరి తిరుగని ప్రలాన
దేని కేడు
ఖైదిగద!
మానవతన్నది బలవంతంగా విస్మృతిచేసి
మన అసురదౌర్జన్యం—
మొరటుదనంతో మృగాలజగంలో
వెదజల్లుతు మనంహింసారతిలోపాందేఎంతృప్తి—
కార్ఖానాలూ కొలువులూ
బిగియగట్టి ఉంచిన మన ఈ నాగరిక సంఘం—
కని ఆమె అద మనుసో అని
నీచపు బంధాలదొడ్డిని
ఊపిరి తిరుగని మడ్డిని
దేవినిలా
నేడు మనం బందీగా జేశాం!
మనం చేసే ఘోరాలకు మందలించలేను దేవి!
న్యాయం పేర మనం
లోకంగగాయం చేసినగుండెలు—
పాలెపురుగు గూటిలోన కీటకాలలా
మన వ్యాపారపుటిమపటిడిలకులలో చిక్కుకు
తప్పించుకునే దారిలేక
గిజగిజ కొట్టుకుపోయే హృదులాత్మలు—
అబ్బా!
అది తలపుకు వస్తేనే
ఒడలంతా కంపిస్తున్నది!
బురదలోన పొరలాడే పందుల
బ్రతుకులకన్నా నికృష్టమా బ్రతుకులోన
మానవతన్నది దిగజారగ,
పైశాచిక కృత్యాలకు నిలయాలగు
ఛండాలపు సందులలో, గొందులలో,
పెరిగిపచ్చు పెట్టులేని
పాపపు కూపంలో
దిగబడి
ఎలాంటి పైచ్యానికి తోడా
పాల్పడడానికి సందేహించని
పసుప్రవృత్తిని పొందుతున్న వే
ఎన్నెన్నో జీవాలు!
వాటికి పేదరికాన్నిచ్చి,
మనం చేసిన నేరానికి
అది జైళ్ళల్లో కఠినశిక్ష లనుభవించాలి!
జాలిఅన్నదే లేకుండా
ఈపూలను నేలను రాలించి
ఆ రేకుల కాలను రాచే,
మనకర్కశకార్యానికి
మనలను మందలింపగల
మాన ముండియు
లేచివచ్చు శక్తిని గనలేదుదేవి,
తనకేలను నిల్వమి వాడిశక్తి!
పందులు, కోళ్లూ
పడిఉండే చోటులకన్నా
హీనమైన స్థలములలో నిద్రా,
తిండికాని తిండీ,
ఇంతేనా ప్రతిఫలం?
ఆఫీసుల్లో
ఫాక్టరీలలో
వడి సంద్రాల్లో
పొలాలలో
ఖర్చయిపోయే బ్రతుకులకు
మనమిచ్చే విలువిదేనా?

వెలఎంతో తెలియని
జీవితాలిలా
దుర్వ్యయమైపోతుంటం కాదా ?
శవాల్ని పీక్కుని తిని బ్రతికే
రాబందుల్లా
మనమమానుషంగా
కోట్లకొలది తోడివార్నిలా
కడుపు తియక్కునిపోయే పేదరికంలో
అణగార్చుతమేనా ?
చిలుకల పీకలుకొరికే పిల్లులమై
పసిపాపలమనసుల వికసింపగనీయక
నమిలేస్తామా ఈలాగున ?
తిండిలేక మాడిదానికో —
లోహచక్ర పైశాచికవిజ్ఞానం
మానవ నివేదనాశక్తిని
భయంకరంగా ఆకర్షిస్తూ,
అంతులేని రహశ్చర్యంతో
తమ ఉన్మత్తావస్తుల భ్రమణ
హృదయ విదారణ దారుణ
భీషణ ఘోషణలతో
కార్మికుల హృదంతరాలు
దొంగిలించివేయగా
చివరకచట
మానవులే నిర్జీవ పదార్థాలుగ
యంత్రాల్లో భాగాలే జీవంగలవస్తువులుగ
మారే యమసదనాల్లో
తెలవల్లు క్రమించడానికో —
రాక్షసత్వమునతోడివార్నిలా పేదరికంలో
అణగార్చడమేనా ?
మన కార్యకలాపాల్లో
ఒకసారైనా
సౌందర్యమనే మాటను
తలపెట్టగలోమా ఇక ?
చేయడాని కింకేంలేదా
దైవానికి మొరలిడుకోడం మినహా ?
ఛీ, ఛీ, ఇంత అశక్తులమా ?
పాశవిక శక్తులమా !

* * * *

ఒకనాటి మానవసంఘంలో
కదలాడిన సత్యాగ్రహశక్తి
మరి ఒకమారీ కుళ్లు ప్రపంచంలో
కదలే సుదినం రాదా !
అపుడు జేవి దుఃఖభరంతో
కనుకొలకుల జార్చుదసలు
దుర్బలమై అశ్రుధార !
ఒక్కుఉదుట లేస్తుంది !
క్రోధపూర్ణ తీక్షణచిహ్న
కదలాడే పిడికల అనిఒక్క
ఆపరమాత్ముని దివ్యరౌద్రత
తనకేల చలిస్తుంటే
ఆమె మనస్సంతా
ఉత్సాహంతో
పొంగి పొరలుతుంది !
నరకంలో
ప్రళయపు 'క్యారీ' గుట్టలలో
రాయిరప్పు సంతరించి
తన్ను కాలు పెట్టనీక
మానవజీవిక చుట్టూ
దుష్టశక్తులలా కట్టి
నిలబెట్టిన గోడలు
ప్రవాదుల్లో జేవి
నేలబడ గొడ్తుంది !
కృతక తారతమ్యాల్ని
అన్యాయపు వ్యాపారాన్ని
పేరాసలయాజమాన్యమునకు దోహదమునపద్ధతుల్ని
ఒక దెబ్బకు తెగగొట్టుంది
దీక్షాపరతంత్ర, జేవి,
సత్యాగ్రహ తరకలనితనిత నిశితాసి ధారతో !
ముక్కుముక్కలై, పొగలై,
ఈ దౌర్జన్యాలన్నీ
మచ్చునకన్నా కనబడకుండా
మాయమైపోతాయి ప్రపంచంలో !
అన్యాయం మనస్సులో
మరణభీతినింపే స్వరకల్పనతో
విలయగీతికలు పాడుతుందప్పుడు జేవి !
తిరిగి
తనవికాల రాజ్యవీథుల్లో
ఊరేగుతుంది

సత్యాగ్రహ ఖడ్గం
దక్షిణాఫ్రంతో దిగబట్టి ఆమె !
మరల ధరణి నారంభిస్తాయి
కనులకు పండువుచేసే పైడిదాడి వేడుకలు !
ఆఖర్గం వాడిలంచు
దురుకునలు లోర్వలేక
మనిషిమనసు కొఖరాన్ని
మాని వికృతధూతరాశి
పలిస్తుంది పలాయనమంత్రం
ఏనాడా దొరకరాని నీచలోకం !
బృహజ్జ్వలత్సత్యాగ్రహ వర్తుల చాలనాలలో
దృఢదీక్షాశాలోత్సాహ శ్రీ పాలనాలలో
తిసులుకొన్నదై
గాలికెదుర గొట్టుకుపోతుంది
ప్రదుకుల కాధారంగా
మనం కట్టుకొన్న ఈ చీకటికుటి
ఈ అనరూధమమా ఆర్థికగృహం !
కత్తి అంచుటుకుకు లోర్వలేక
ఈ అకుకులబొంతలు—
మనవ్యాపారం, పేరాపా, పాతికోలు,
మన పైశాచికలోకం అభివృద్ధి,
సమూలంగా ఆ పిడుగులలో
పరమాణువులై చెల్లాచెదరైపోతాయి !
మనిషిమనసు వింతదాక
శాశ్వతమున దిగకొట్టిన
ఇనుప మేకు లీ పన్నులుగల బరువసువస్త్రాలు
పడలిపోయి,
ఈలోహపు క్రమతెర దిగజారిపోయి,
వలిక వస్తుంది
ఆలోచనాశక్తి !
దేవలోక రాజ్ఞవోలె
ప్రణవాభాస్లావిత సురవీధుల్లో
విహరిస్తుంది !

* * *

మరొకసారి మాదేవికరాలకురావా
సత్యాద్రి జనితా నీ,
అమరశక్తి సంకలితాగ్రహమా,
పరమాత్ముని బంటై
మా భూముల్లో విర్రవిగి పెరిగిన పాపులపంటను
ఆమెమరల మొదలంటగ తెగగోయగ ?
ఓ సత్యాగ్రహమా !

(లాసిలెస్ ఎబర్‌క్రోంబీ వాసిన "ఇండిగ్నేషన్ ఎన్ ఓడ్" ఆధారంగా రచన)



# చంద్రేణైకపుత్రః

శ్రీ శ్రీనివాస శిరోమణి

•

"అక్కయ్యా, బావ ఏంచేస్తున్నాడు" అంటూ పొద్దునే కరణము రామయ్య వచ్చి సుబ్బమ్మను అడిగినాడు

"కూర్చోండి పంతులూ, నిన్న ఉదయము పొలంపోయినారు ఇంతవరకూ రాలేదు రాత్రికి వస్తాము అన్నారు" అన్నది సుబ్బమ్మ

"ఎందుకు పోయినాడు?"

"అక్కడ వారి కోలాడు ఎవడో పిల్లగాడు ఉన్నాడుట. వాణ్ని పెంచుకోవలసింది అని వారి వారు అందరూ పట్టుపట్టినారు ఆ పిల్లవాణ్ని చూడటానికి పోయినారు"

"అదేమిటి అక్కయ్యా, బావకు మతిపోతే పోయింది, నీకుకూడా మతిపోయిందేమిటి?—ఏ ఒక్క చోటనైనా పెంపుడు కొడుకు అక్కడము కానీ పెంచుకొన్న తల్లితండ్రులకు ఉపయోగ పడటము కానీ చూచినావా! లేనిపోని తద్దినం పెంపుడు అంటే తగాదా కొనుక్కోడము అన్న మాట ఈ శాస్త్ర విషయము నీకెట్లా తోచలేదు" అన్నాడు రామయ్య

"పంతులూ, మీ బావగారి సంగతి నీకు తెలియనిదేముంది? అనుకొన్నట్టు చేసి తీరవలసిందే"

"కాదు లేవమ్మా, నీకు తోచిఉండదు లేక పోతే నీవు చెప్తే బావ వినకపోవటము ఏమిటి?—"

"అయితే నాఇష్టముతోనే మీ బావగారు ఈ ప్రయత్నము అంతా చేస్తున్నారు అంటావా?"

"కుతరాయూనూ."

సుబ్బమ్మ ఒక్కనవ్వు నవ్వింది. "సరే ఆయన గారు రానియ్యి చూదాము" అన్నది.

"అయితే అక్కయ్యా, నీకు పిల్లలు కనే వయస్సు మళ్లింది అంటావా?"

"ఇంకేమి పిల్లలు నేను కిందటి గాలివాన ఇంకా అయిదు సంవత్సరాలకు కొడుకుంది అనగా కాపురానికి వచ్చినాను గాలివాన కొట్టి ఎన్నేళ్లు అయిందో లెక్క చెప్పు"

"గాలివాన కొట్టి ఇప్పటికి పాతికేళ్లు అయింది ఏమైతే—నీ కడుపున ఒక కాయ కాయ కూడదూ" అన్నాడు రామయ్య

"చాలులే—నీ చమత్కారము నలభైఅయిదు దాటిపోయినవి ఇంకా పిల్లలు ఏమిటి"

"పోనీలే—నీవు పిల్లలను కనలేక పోయినా మా బావకు పిల్లలు పుట్టే వయస్సుమాత్రము మళ్ళలేదు"

సుబ్బమ్మ నవ్వింది కాని ఆమె ఊహలు ఎక్కడెక్కడికో పోయినవి ఒక్కసారి రామయ్యను తేరి పారచూచి "నిజమే పంతులూ, నీవు అన్నట్టు నా పిల్లవాడు కాకపోయినా ఆయనగారి పిల్లవాడు అయినా కొంత నయమే" అన్నది

"అదేనమ్మా నేనూ చెప్పబోతూఉంది" అని రామయ్య అంటూ ఉండగా కిర్రుచెప్పులతో గ్రామ మున్సబు నారయ్య వచ్చినాడు రామయ్యను చూస్తూ "పంతులూ ప్రొద్దునే వచ్చినావు. ఏమిటి తహశీల్దారు మన ఊరు వస్తున్నాడు అని కాదు ఏమైనా పంపించినాడా" అన్నాడు

"అదేమీలేదు ఒక జ్యోతిషి మన ఊరువచ్చినాడు. ఆయన పాండిత్యము మీరు పరీక్షించవలెను"

"ఇంతకూ నీకు ఆయన ఏమి జోస్యము చెప్పినాడు" అంటూ నారయ్య కుర్చీలో చేరగిలబడినాడు.

"ఇప్పుడు ఉన్నవాండ్లు చాలనట్టు ఇంకా నల్గురు ఆడపిల్లలు పుట్టుతారు అన్నాడు"

"కలాప్ ముత్తము పదిమంది అవుతారు అన్న మాట ఆడుది అంటే మా చెల్లెలుకే తగిపోయింది చూడు మా అక్కడను "

"సరేలే సరాగము" అంటూ సుబ్బమ్మ "ఎప్పుడో ఎందుకు పంతులూ—ఆ జోస్యులను ఇప్పుడే పిలిపించు మా బావగారు పోయివచ్చిన పని పండో కామో తేలుచుంది మాకాను" అన్నది

"పంతులూ—ఇప్పుడే పిలిపించవయ్యా—మధ్యాహ్నము నుంచీ నేను మళ్లీ ప్రయాణము అయి పోతాను మాతోవాడు లేడు ఎవరిని పంపిస్తావు" అన్నాడు నారయ్య "గురవణ్ని పంపిస్తానులే" అంటూ సుబ్బమ్మ లోపలికిపోయి పాలూ పెరుగూ నెయ్యి మొదలు అయిన మోయానా సామగ్రులు అన్నీ ఇచ్చి అవన్నీ కరణముగారి ఇంట్లో ఒప్ప చెప్పి అక్కడ ఉన్న జోస్యులవారిని వెంటనే పిలుచుకొని రమ్మన్నది రామయ్య గురవణ్ని చూస్తూ "వీడు ఎవడు బావా, గుండు అల్లె ఉన్నాడు వీడు ఏ దేశమునుంచి ఇక్కడికి దిగినాడు" అన్నాడు

"మా అక్క వంటచేసుకోలేక చిత్తూరుజిల్లా నుంచి అల్లా వీణ్ని రావించిందయ్యా" అన్నాడు నారయ్య

"వీడు ఆత్తే తినలే దు అనుకొంటాను"

"చాలు లెస్సురుమా తేళాకోళాలు అనోస్యులు వచ్చేసరికి మీరు కొంత మంచిమాట చేసుకోండి" అంది సుబ్బమ్మ, నారయ్య లేచి ఇంట్లోకిపోయినాడు



నారయ్య మామూలు గ్రామ మున్సబుల మాదిరిగా కరణాల దస్త్రాల కావలివాడు కాడు అతను బుద్ధిమంతుడు. ప్రతిభావంతుడు, చిన్నప్పుడు అయితే చదువుకోలేదు, కాని వయస్సు వచ్చిన తరువాత ఒక భట్టురాజుగారిని ఇంట్లో ఉంచుకొని తెలుగు ప్రబంధాలు అన్నీ చదివించుకొని తెలుసుకొన్నాడు వ్యవహార జ్ఞానముకోసము ఒక ఇంగ్లీషు అయ్యవారిని పెట్టుకొని ఇంగ్లీషు నేర్చుకొన్నాడు ధారాళముగా ఇంగ్లీషు మాట్లాడుతాడు దొరలు మాట్లాడినా ఇంగ్లీషు ఇట్టే తెలుసుకొని ఇంగ్లీషులోనే జవాబులు చెప్పతాడు

పితృ పితామహార్జితము ఒక ఏభైయకరాల మాగాణిభూమి, ఒక నూరు యకరాల మెట్టభూమి ఉంది తాత ముత్తాతలు "వస్తు కుమ్మొయ్యి మొహ్రో శిస్తులు కట్టలేము" అన్నప్పటికీ తహసీల్దార్లు శిస్తులు పెంచడానికి మంజూర్లు చేసిన ఇసుక పర్రలు వందలకొద్దీ యకరాలు నారయ్య హయాములో సరుకు వనాలు అయిపోయినవి అందువల్ల టోకు బేరముచేసి సరుకు కర్రల అడితీ ఒకటీ రైసుమిల్లు ఒకటీ ఉన్నవి అయన ఆ గ్రామపంచాయతీబోర్డు ప్రెసిడెంటు కూడాను ఇంకా ఇట్లాంటి గౌరవోద్యోగాలు ఎన్నో ఉన్నవి వదిలే చోట ధారాళముగా వదలివేస్తూ—పట్టవలసినచోట మంచి గావుపట్టు పట్టడమూ ఆయనకు బాగా తెలుసును దానమూ ధర్మమూ పేరూ ప్రతిష్ఠ కలవాడు

వ్యాపారమూ వ్యవహారాలూ నారయ్యవంతు వ్యవసాయమూ గొడ్డూ గోదా ఇల్లూ వాకిలీ మొదలు అయినవి అన్నీ సుబ్బమ్మవి నారయ్య చెప్పినమాట అడుక్కోవ్వ ఎప్పుడు అయినా దలామణీ కాకపోతే కాకపోవచ్చును, కాని సుబ్బమ్మ మాట అడుక్కోవ్వ సుగ్రీవాజ్ఞ ఇకను ఆ దంపతులకు తీర్పరీ కూర్పరీ కరణము రామయ్యపంతులు రామయ్య నారయ్యకన్నా పదిఏళ్లు చిన్నవాడు

రామయ్యమాట నారయ్య ఎన్నడూ తీసివేసే వాడు కాడు నారయ్య చెప్పింది చేయకుండా రామయ్య ఎన్నడూ తలాయించిందీ లేదు ఇద్దరూ ఒక్కమాటమీద పోవాండ్లు, అందువల్లనే

గ్రామములో పోట్లాటలు వచ్చి పార్టీలు పడి గడ్డివాములు తగులబెట్టుకోడము కానీ వారి గొడ్లకు వారూ వీరూ వీరిగొడ్లకు వారూ మందులుపెట్టి చంపి వేయడాలు గానీ లేవు ఇన్ని మాటలెందుకు— అది బస్తీపక్కన ఉన్న పల్లెటూరు. అయినప్పటికిన్నీ ఒక సివిల్ వ్యవహారము కానీ ఒక క్రిమినల్ వ్యవహారము కానీ ఊరుదాటి కోర్టుకు పోయింది లేదు

నారయ్య కానీ అంత కుంకుమబొట్టు పెట్టుకొని లోపలినుంచి బయటకు వచ్చినాడు అప్పుడే జోస్యులున్నూ వచ్చినాడు జోస్యము వినడానికి సుబ్బమ్మకూడా వచ్చి తలుపుచాటున నిలుచున్నది నారయ్య జోస్యుడిని ఎగాదిగా చూచి "బాలజ్యోతిషం వృద్ధవైద్యం" అన్నారు. బాగుంది జోస్యులూ జాతకము ఇవ్వగానే ముందుగా ఏమి ఆలోచిస్తావు?" అని ప్రశ్న వేసినాడు

"ఆయుర్దాయాన్ని గురించి ఆలోచిస్తాను"

"అయితే ఈ జాతకానికి ఆయుర్దాయము చెప్పు" అంటూ జాతకచక్రము ఉన్న కాగితము నారయ్య జోస్యులకు ఇచ్చినాడు రామయ్య "జోస్యులు బాబూ లగ్నము ఏమిటి—నక్షత్రము ఏమిటి" అన్నాడు.

"మేషలగ్నము—మఘానక్షత్రము" అంటూ "జాతకుడికి దీర్ఘాయుర్దాయము పట్టింది జాతకము మహాదొడ్డది ఒక్క పంచమ భావానికి తప్ప మరి ఏ ఇతర భావానికి ఏదోషమూలేదు పంచమాధిపతికిన్నీ పంచమ స్థానానికిన్నీ పాపార్గళం పట్టింది పుత్రకారకుడు అయిన "

"ఇదుగో జోస్యులూ మాకు నీశాస్త్రము గోల అంతా అక్కరలేదు ఫలము చెప్పండి" అన్నాడు నారయ్య

"ఇప్పటికి సంతానము లేదు" అన్నాడు జోస్యి

"సరే ఇకముందు సంగతి?" అన్నాడు రామయ్య

"అయితే కర్మస్థానాధిపతి అంటున."

"దత్తుచేసు కొంటానేమో చెప్పవయ్యా" అన్నాడు నారయ్య.

"దత్త పుత్రయోగములేదు."

"దత్తు చేసుకొంటే"

"దత్తత చేసుకోటము ఉండదు. అథవా దత్తత చేసుకో తలచుకొన్నా కానపొగదు. విఫలము అయిపోతుంది"

"అంటే"

దత్తుకు ఇంటికి రాగానే చస్తాడు"

"అమ్మనాయనో—పుత్రశోకమనన్నా దత్త పుత్రశోకము పట్ట శక్యముకాదు అన్నారు పెద్దలు" అన్నాడు రామయ్య నారయ్య ముఖము వెలా వెలా పోయింది

"అయ్యా ఈ జాతకములో ఉపపదానికి చంద్రశుక్ర సంబంధము పట్టింది కాబట్టి తీవకళత్రము ఉంటుంది. కర్మస్థానము బాగాఉంది కర్మకారకుడూ కర్మాధిపతీ బాగా ఉన్నారు "శుభదృగ్యోగాత్సుందరీ" అని మాత్రము మంచి అందకత్తెను జాతకుడు కొద్ది రోజులలో పెండ్లి చేసుకొంటాడు "స్వకులే గుప్తాచ" "చంద్రే త్రైకపుత్రః" అనే మాత్రాలున్నూ జాతకానికి అన్వర్తిస్తవి ఆ అందకత్తెకు ఒక పిల్లవాడు పుట్టుతాడు. వాడు ఈ జాతకుడికి కర్మాధికారి అవుతాడు. తప్పదు"

నారయ్య పకపకా నవ్వినాడు సుబ్బమ్మ తీవ్రముగా ఆలోచించడము మొదలు పెట్టింది. రామయ్య "శాస్త్రిలవారూ, సంతానము ఇంకా ఎంత కాలానికి కలుగుతుంది" అని ప్రశ్నించినాడు

"ఎక్కే ఎంతో కాలానికా—ఇప్పుడు కర్మాధిపతి అయిన శనిదశలో కుటుంబాధిపతి అయిన శుక్రభుక్తి నడుస్తూఉంది కొద్దిరోజులలో తీవకళత్రమూ ఆ తరువాత—కేటికి పదహారు మాసాలలో జాతకుడికి కర్మచేసే పిల్లవాడు పుట్టుతాడు "

"అట్లా నిజముగా పదహారు మాసాలలో పిల్లవాడు పుట్టినట్లయితే మీకు నూటపదహార్లు బహుమానము ఇస్తాను" అన్నాడు రామయ్య

"తప్పకుండా నూటపదహార్లూ బహుమానము పుచ్చుకొంటాను" అన్నాడు జోస్యి. నారయ్య పది రూపాయలు కాంబూలములో పెట్టి జోస్యుడిని సన్మానించినాడు. రామయ్యతో జోస్యి వెళ్లిపోయినాడు. నారయ్య పెండ్లాన్ని చూస్తూ "నేను దత్తుచేసుకొ

టాను అని మాట ఇచ్చినాను. ఏమి అవుతుందో చూడవలెను" అన్నాడు.

"ఏమి అవుతుంది తోడుగ్గల కోడివాకొన్న "

"అయితే నేను దత్తు చేసుకోడము నీకు ఇష్టము లేదు అన్న మాట"

"నేను అనేకమార్లు చెప్పినాను మీరు వినాన్ర లేదు ఏమి చేసేది? మొదటికి పుట్టిన పిల్లవాడు అయినా పెండ్లానికి పుట్టిన పిల్లవాడు అయినా ఉప యోగపడుతాడు కాని ఏ అయ్యకో ఏ అమ్మకో పుట్టినవాడు ఎప్పుడూ అక్కరకురాడు" అంది సుబ్బమ్మ

"ఎట్లాగూ—" అని నవ్వినాడు నారయ్య

* * *

జ్యోతిష్కుడు చెప్పిపోయినట్టుగానే నారయ్య దత్తు చేసుకో తలచుకొన్న పిల్లవాడికి నాల్గురోజులు జ్వరము కాసి చనిపోయినాడు వంశము నిలవడానికి ఇంకొక పిల్లను పెండ్లి చేసుకోవలసిందేను అని సుబ్బమ్మ పట్టుపట్టింది రామయ్య అందుకు తోడా చేసినాడు నారయ్యకు ఇష్టముఅయినా కాకపోయినా గ్రహాల ప్రభావమో ఏమో మళ్ళీ పెండ్లి చేసుకోటానికి ఒప్పుకొన్నాడు సతిని సంపాదించ టానికి సుబ్బమ్మే పూనుకొన్నది బహు సంతానము చాలు ఉన్న కుటుంబాలలో పిల్లను తీసుకొని రావ లెను అనుకొన్నది విచారించింది స్వయముగా బయలుదేరింది దూపాటి సీమలో ఒక పేదకుటుం బాన్ని చూచింది. ఆ ఇల్లాలు తొమ్మిదిమంది పిల్లలను కన్నది పెద్దపిల్లకు ఇరవై సంవత్సరాలు దారిద్ర్య మువల్ల పెండ్లి కాలేదు తల్లికి మాదిరిగానే రెబట అల్లె ఉంది తల్లి చాలు పిల్లగా సుబ్బమ్మకు ఆ అమ్మాయి తోచింది ఆ పిల్ల తల్లితండ్రులనూ తక్కిన సంతానాన్ని పోషించే భారము తనదేను అన్నది. పెనిమిటికి పిల్లను కుదిర్చింది దైవానుకూలముగా ఉంటేటందుకు ఏకుకొంటేలవాడి ఎదుట పెండ్లి జరుగ వలెను అని నిర్ణయించింది

శుభ ముహూర్తాన తిరుమల క్షేత్రములో పెని మిటి నారయ్యకూ సవతి మంగమ్మకూ మూడుముళ్లూ వేయించింది. అంతటితో ఆమెకు తనివి తీరలేదు. ప్రత్యేకముగా మొగుణ్ని సవతిని అలమేలు మంగా పురము తీసుకొని పోయి అక్కడ దేవాలయంలో ఉన్న సంతాన గోపాలకృష్ణుడికి మొక్కించింది. పుట్టేడు పటిక బెల్లము నైవేద్యము పెట్టించి నూతన వధూవరుల చేత పసిపిల్లలకు పందారము చేయించింది

తిరుపతినుంచి ఇంటికి తిరిగి రాగానే వ్యవసా యపు పనులు అన్నీ మంగమ్మ తండ్రికిన్నీ గొడ్డూ గోదా వ్యవహారాలు అన్నీ మంగమ్మ తల్లికి సుబ్బమ్మ ఒప్పగించి వంట ఇంటి పెత్తనము మాత్రము తనమీద వేసుకొంది నారయ్యకూడా సుబ్బమ్మకు ఏమాత్రమూ తీసిపోలేదు తమ డాబామీద శీతవాత వర్షాతపాలకు లొంగిపోకుండా ఉంటేటట్లుగా రెల్లు గడ్డితో చలువపందిరి వేయించినాడు ప్రాచీనా ర్వాచీన పద్ధతులను వేటినీ వదిలి పెట్టకుండా పపుశ గది పరంజామా అంతా తెలలాగులు అన్నీ చూచి మద్రాసునుంచి తెప్పించి ఆ చలువ పందిరిలో అమ ర్చట్లు చేసినాడు అది నూతన వధూవరుల కళియాక్షి గృహము అయింది

నారయ్య అంతటితో పోనీయలేదు తన మున్నుబుగిరీకి గుమాస్తాను ఏర్పాటు చేసినట్టుగానే రామయ్య పంతులు కరణీకాని కిన్నీ ఒక గుమా స్తాను ఏర్పాటుచేసి తన రైసుమిల్లు—కమ్టెల అడితి వ్యాపారము అయనకు ఒప్పగించి ఇల్లు కదలకుండా ఉండిపోయినాడు భోజన మజ్జనాదులకు తప్ప డాబా దిగడము మానివేసినాడు ఇక మంగమ్మ సంగతి చెప్పవలసిన అవసరమే లేదు

చక్కని చిక్కని ఎద్దుల జతను సంతలో చౌకగా కొనుక్కొని తెచ్చి ఇంత ఉద్దిపూడూ దాణా తెలక పిండి పెట్టి మేపితే వారము రోజులలో తేయకొని బుసలుకొట్టుకూ చక్కగా పొలము పనిచేస్తవి కుక్కకు ఒక్కపూట ఇంత అన్నము వేసి అంత తెల్లము పెట్టితే అది తెల్లవారేసరికి ముంజాకొని శ్లాఘామంటూ ప్రతివాణ్ని కరవబోతుంది అయితే మానవుల ఎడుగు బొదుగులు తిండిమీద ఆధారపడవు అని ఇంగ్లీషు వైద్యులు అంటారు ఇది నిజమో చేనిజమో తెలియదు కాని మంగమ్మ మండలము రోజు లలో గుర్తుపట్టడానికి వీలులేకుండా మారిపోయింది బంగారు తీగ మాదిరిగా తయారు అయింది కోడక ళలా ప్రపూర్ణము అయిన చంద్రబింబము మాదిరిగా ఆమె ముఖము కనుపించసాగింది.

రోజులు గబగబా పరుగెత్తసాగినవి. మంగ మ్మకు నిన్నకో మొన్నకో ఆ ఇంటికివచ్చినట్టుగా

ఉంది. కాని అప్పటికే రెండుకాన్పులు గడ్రవ తిరిగి పోయినవి సుబ్బమ్మ తాతగారికి జబ్బుగా ఉందిఅని ఒక్కసారి పుట్టినింటికివచ్చి పొమ్మని వర్తమానాలు వస్తూ ఉన్నవి ఆమె కాపురానికి వచ్చిన ఈపాతిక సంవత్సరాలలోనూ ఎప్పుడు పుట్టినింటికి పోయినా సాయంత్రానికి స్వగృహానికి చేరేది ఉన్న గొడ్ల పాలు సుబ్బమ్మ తప్ప మరి ఎవరూ తీయడానికి వీలు లేదు ఒకవేళ ఎవరు అయినా తీయబోయినా ఆ గొడ్లు ఆమెకు పాలుఇచ్చినట్లు ఇతరులకు ఇవ్వవు, తాతగారిని పోయి చూసిరావలెను అని సుబ్బమ్మకు ఎంతో అభిలాషగా ఉంది గొడ్ల పాలుతీయడము ఎవరికి ఒప్పచెప్పడము అనే చిక్కులో పడ్డది మంగమ్మ తల్లి తనకూతురు గొడ్లపాలు తీయడములో నేర్పరి అని చెప్పింది సుబ్బమ్మ మంగమ్మను పరీక్షకు పెట్టింది పొల్లు ఆవులుకూడా మంగమ్మ చెంబు తీసుకొని కూర్చుంటే శేర్లకు శేర్లుపాలు కార్చడము మొదలు పెట్టినవి సుబ్బమ్మ నిజముగా ఆశ్చర్యపడి పోయింది "పది సంవత్సరాల ఈమధ్య ఈ గొడ్లు నాకు ఇన్ని పాలుఇచ్చి ఎరగవు చెల్లెలా నీ సుతారము నాకు కూడా నేర్పు" అంది సుబ్బమ్మ మూడు రోజులు అయ్యే సరికి గొడ్లు అన్నీ మంగమ్మకు మాలిమి అయిపోయినవి పాలు సమృద్ధిముగా ఇవ్వడము మొదలుపెట్టినవి సుబ్బమ్మ ఎంతో సంతోషపడ్డది "చెల్లెలా, నా ప్రాణము తెరపినపడ్డది ఇంత కాలమూ ఏ ఊరు అయినా పోయి నాల్గురోజులు ఉండి రావడానికి ఈ గొడ్లమూలాన వీలు కాకుండా పోయింది అబ్బ ఇంతకాలానికి నీవు దేవతవు మల్లె వచ్చినావే చెల్లెలా!" అంటూ సుబ్బమ్మ మెచ్చుకొన్నది

ఇంతలో సుబ్బమ్మగారి పుట్టింటినుంచిజట్కాబండి వచ్చింది ఆమె తాతగారు ఏక్షణమో దేహము చాలించేట్లు ఉన్నారు అనీ ఆమెను ఆయన చూడవలెను అనుకొని బండి పంపించినారు అనీ బండివాడు చెప్పినాడు ఆమెకన్నుల వెంట నీరు కారుతూ ఉంటే "ఎందుకు అక్కా ఆలోచిస్తావు, ఏమీ భయములేదు పోయిరా నేను అంతా జాగ్రత్తగా చూసుకొంటాను" అన్నది మంగమ్మ

"చెల్లెలా ఈ రోజు పగలు ఎట్లాగో గడుపు, నావెంట మీ అమ్మనుకూడా తీసుకొనిపోతాను మా ఊరు ఇక్కడికి మూడుమైళ్లలో ఉంది రేపు ఇద్దరమూ సాయంత్రానికి వస్తాము. లేకపోతే మీ అమ్మను పంపించివేస్తాను," అని మంగమ్మతో చెప్పివారయ్యనుకూడా తనవెంటరమ్మన్నది సుబ్బమ్మ ఆయన అయితే బయలుదేరలేదు కాని సుబ్బమ్మ ఆమెకు తోడుగా మంగమ్మతల్లి జట్కాబండిలో ప్రయాణము అయిపోయినారు

సుబ్బమ్మ పుట్టింటికి వెళ్లిన రెండురోజులకు వారయ్య జిల్లాబోర్డు మీటింగుకు వెళ్లవలసి వచ్చింది అతడు ఆమరునాడే రావలెను అనుకొన్నాడు కాని సాధ్యముకాలేదు వారము రోజులు అయినా సుబ్బమ్మ కానీ వారయ్యకానీ తిరిగి రాలేదు అంత ఇంటికి మంగమ్మే సర్వాధికారి అయిపోయింది

అది కార్తీకమాసము మధ్యాహ్నము మూడు గంటలు అయింది హఠాత్తుగా మబ్బులుపట్టినవి కాస్సేపటిలో చీకటిపడ్డట్టు అయిపోయింది చేలలోకిపోయినగొడ్లు అన్నీ ఇంటికి వచ్చినవి జీతగాండ్లు అందరూ ఇండ్లకు పోయినారు రాత్రి పడుకోడానికి వచ్చే జీతగాండ్లు అన్నాలు తిని వస్తాము అని చెప్పి వెళ్లిపోయినారు చీకట్లు బాగా కమ్ముకొన్నందువల్ల ఇంకా ఎంతపొద్దుఉంది తెలియలేదు ఎప్పుడో ఎందుకు అనుకొని గురవడు వంట చకా చకా చేసివేసినాడు కొద్ది కొద్దిగా చినుకులు పడుతూ ఉన్నవి గాలిమాత్రము జోరుగా ఉంది మంగమ్మ పొంతకుండలో వేడినీళ్లు స్నానము చేసింది శీతాకాలాన్ని మించిన చలివేస్తూ ఉంది ఉత్తరమునుంచి విపరీతము గాలితోలుతూ ఉంది ఆచలికి మంగమ్మ రోజూకన్నా మరికాస్తఅన్నము తిన్నది పయికిపోయి పడుకొనడము ఆగాలీ వానలో సాధ్యము అయ్యేట్లు ఆమెకు కనిపించలేదు కిందనే పడుకొంది చీకటిపడేవేళకు చినుకులున్నా జోరు చేసినవి మంగమ్మ కాలుత ముసుగుపెట్టుకొని పడుకొంది ఇట్టే నిద్రపట్టింది

రాత్రి తొమ్మిదిగంటలు అయింది మంగమ్మ ఉలిక్కిపడ్డట్టుగా లేచింది గాలి ఈలలు వేస్తూ ఉంది వాన ఎడాపెడా కొడుతూఉంది దీపాలు ఎప్పుడో ఆరిపోయినవి దీపము వెలిగించడానికి నిప్పుపుల్ల గీస్తే నిలవలేదు, ఆరిపోయింది.

అంతా అంధకార బంధురముగా ఉంది. తలుపు ఏ వైపున ఉంది కిటికీలు ఏ వైపున ఉన్నవి చటుక్కున తోచలేదు. వసారా పెంకులు లేచిపోతూ టపీల్ టపీల్‌మంటూ చప్పుడుచేస్తూ ఉన్నవి. ఆమెకు భయము వేసింది. "సురవా—సురవా" అని కేక వేసింది. జవాబులేదు. ఆ చీకటికి కన్నులు అలవాటుపడ్డవి. కిటికీలూ తలుపూ లీలగా కనిపించినవి. ఎట్లాగో ధైర్యము చిక్కబట్టింది. తలుపు తెరిచింది. దీపము లేదు. లాంతర్లుకూడా నిలవడములేదు. మస్తకమున్నా మెరుపులు పట్టపగలు అంతా వెలుగు చేస్తూఉన్నవి. వాగ్గజాల ఎద్దులనూ హాలులో వదిలిపెట్టి సురవడు బయటికి వస్తున్నాడు.

తటుక్కున మెరుపు మెరిసింది. గొల్లకొట్టము మీద పెంకులు గాలికి ఎగిరిపోతూఉన్నవి. చిమ్మిరి గొట్టములోనుంచి నీళ్లు కొట్టుతూ ఉన్నట్టుగా వాన దంచుతూ ఉంది. బిత్తరపోయి చూస్తూ నిలుచుంది. దూడి గదుయూ పాడి ఆవులనూ సురవడు ఇంటిలోకి తోలి తెక్కవ గొప్పెను బయటకు పోవడానికి మెట్లు తాళ్లు వదిలివేసినాడు.

"అమ్మగారూ కొవ్వులు బర్రె ఈనేట్టు ఉంది. బ్యాటరి దీపము ఎక్కడుంది" అన్నాడు సురవడు. అదృష్టవశాత్తూ బ్యాటరి దీపము పెద్దది మంగమ్మకు దొరికింది. దీపము వేసి చూపింది. పెంకులు అన్నీపోయిన ఆ కొట్టములోనే బర్రె ఈనుతూ కనిపించింది. దూడను సురవడు ఎత్తుకొన్నాడు. తల్లిగేదను ఇంట్లోకి తీసుకొని రావడానికి మంగమ్మ దారి చూపుతోను ఒక చేతిలో పట్టుకొంది. రెండో చేతిలో బ్యాటరి దీపము పట్టుకొని నడిపిస్తూ ఉంది. ఉత్తరపుగాలి పడమరకు తిరిగిపోయింది. నడువలేక నడువలేక నడుస్తూ ఉంది. గాలి ఒక్క విసురు విసిరింది. మంగమ్మ కాళ్లు నిలపలేకపోయింది. ఎల్లకిలా పడ్డది. సురవడు పరుగెత్తుకొనివచ్చి పసిపిల్లను రెండుచేతులలో ఎత్తుకొన్నట్టుగా మంగమ్మను ఎత్తుకొనివచ్చి మంచముమీద పడుకోపెట్టి "అమ్మగారూ దెబ్బలు నొప్పిపట్టినవా?" అన్నాడు.

"లేదురా—కాళ్లు నిలవలేదు" అన్నది.

"అమ్మగారూ—గేదెనూ దూడనూ నేను చూసుకొంటాను. తాము తడిసిపోయినారు. ఒళ్లు తుడుచుకొని స్వస్థముగా పడుకోండి" అని చెప్పి సురవడు అవతలకు వెళ్లినాడు.

* * *

రాత్రిగది అయినప్పటికిన్నీ కిటికీలుమూసి వేసి ఉన్నప్పటికిన్నీ గాలి రంయ్యమని వస్తూ ఉంది. గోడపక్కను షెల్ఫుమీద పెట్టిన లాంతరులో దీపము గంతులు వేయడము మొదలు పెట్టింది. మంగమ్మ ఒళ్లు కొంగరపోతూ ఉంది. తలగడాగడా తుడుచుకొని చీర రవిక తీసి వేసి ఒళ్లు తుడుచుకొని పెట్టెలో చీరకట్టుకొంటూ ఇటుచూచింది. సురవడు వాకిలిపక్కను నిలుచుని ఉన్నాడు. వాడు తనను చూచినాడా అనే సందేహమువచ్చింది. చీర కట్టుకొంటూనే "సురవా ఏమిచేస్తున్నావు" అని అడిగింది.

"చలికి వణుకుతూ ఉన్నాను" అన్నాడు.

బ్యాటరీదీపము వేసి వాణ్ణి చూచింది. సుందు వంట బరవకు వణుకుతూ ఉంటే వాని దేహమూ—పాము పొట్టవంటివాని పొట్ట—కండలతో ముడుపులు తిరిగిన వాని జబ్బలూ మంగమ్మకు గమ్మత్తుగా తోచినవి.

"ఒరేయ్ చలికి ఎంతసేపు అట్లా వణుకుతావు" అంటూ పెట్టెలోనుంచి తువాలూ పంచే తీసి "ఈ తువాలుతో తుడుచుకొని ఈపంచె కట్టుకో" అన్నది మంగమ్మ.

"పంచే తువాలూ దొరగారివి" అంటూ అనుమానించినాడు. మంగమ్మ ఒక్క నవ్వు నవ్వి "ఇప్పుడు నీవే దొరవు" అని వాడిముఖము వంక చూచింది. వాడికి సిగ్గువచ్చి వాటిని అందుకొన్నాడు. ఆమె చేతులో ఉన్న బ్యాటరీదీపములో బ్యాటరి అయిపోయింది. గంతులువేస్తూ ఉన్న దీపము ఎప్పుడో ఆరిపోయింది. అంతా చీకటి సుయ్యారముగా ఉంది. గాలీవానా మరింత జోరు అయింది. మంగమ్మ పడుకొంది. ఆమె ఒళ్లు అంతా తిమ్మిరి తిమ్మిరిగా ఉంది.

"సురవా" అని పిలిచింది.

"ఆఁ" అని పలికినాడు.

"ఒరేయ్ నాకు భయముచేస్తూ ఉంది. నీవు ఇక్కడకు రా" అన్నది. వాడు ఆ చీకటిగదిలోకి వచ్చినాడు.

* * * *

గాలివానవాడు రాత్రి ఇంటి కాపలా కాదూ సురవడూ తప్ప ఏ జీతగాడూ ఇంటో లేనందుకు నారయ్యకు భుక్తికు కోపము వచ్చింది. కాని ఎవరినీ ఏమీ అనలేదు గొడ్లకొట్టము కొట్టుకొని పోవడము తప్ప ఏ నష్టమూ లేకుండా పోయినందుకు మనస్సులో సంతోషించినాడు గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు అందరూ ఉండడానికి బందోబస్తు అయిన భవంతి వేయించడము మొదలుపెట్టినాడు

సుబ్బమ్మ తాతగారు చనిపోయినాడు దిన వారాలు అయిన తరువాత ఎంతో దుఃఖముతో ఇంటికి తిరిగివచ్చింది గాలివానకు ఏ నష్టమూ రానందుకు ఆమె సంతోషపడ్డది గొడ్లకొట్టము పెంచి జీతగాండ్లు కూడా తమ ఆవరణములోనే కాపురాలు ఉండే ఏర్పాట్లు నారయ్య చేస్తూ ఉన్నందుకు ఆమెకు మరింత సంతోషము వేసింది

అంతవరకూ మందకొడిగా అనారోగ్యముగా ఉంటూ వచ్చిన సురవడు మహా హుషారుగా పనులు చేస్తూ ఉండడము చూచి ఆశ్చర్యపోయింది అందులో పలుకరించినా మాట్లాడనివాడు ఎవరు ఏమి అడిగినా తడుముకోకుండా సురవడు సమాధానాలు చెప్తూ ఉంటే సుబ్బమ్మకు మరింత ఆశ్చర్యము వేసింది

మంగమ్మకు నెల తప్పిపోయింది సుబ్బమ్మ సంతోషానికి మేరలేకుండా పోయింది మూడు నెలలు గడిచినవి మంగమ్మకు కడుపువచ్చినట్లు రూఢి అయిపోయింది ఆమె కొడుకును కంటుందో కూతురును కంటుందోనని అందరూ ఆలోచించ సాగినారు. ఆ ఇంట్లో ప్రతిరోజూ అచ్చట్లూ ముచ్చట్లుగా ఉంది ప్రతిక్షణమూ పండుగగానే ఉంది ఊళ్లోవాండ్లు, అందరూ పండ్లు పసుపు కుంకమా పట్టు రవికెగుడ్డలు, పట్టుచీరలు తెచ్చి ఇవ్వసాగినారు. ఆ ఊళ్లోవున్న బ్రాహ్మణఇండ్ల ఆడవాండ్లు కూడా యథాశక్తిన పసుపూ కుంకమా తెచ్చి ఇచ్చినారు మంగమ్మకు కొడుకు పుట్టవలెను అనే అందరూ కోరుకొన్నారు కొందరు కొందరు కోలాకోలాకి సుబ్బమ్మ కూడా ఇక బిడ్డలను కంటుంది అని అన్నారు.

ఇల్లు అంతా ఎంత గబగబలుగా ఉన్నా ఎంత కోలాహలముగా ఉన్నా సుబ్బమ్మ వెయ్యికళ్ళతో సురవణ్ణి కనిపెడుతూ ఉంది నారయ్య ఏదో వర్తక పనులమీద మళ్లీ ఊరికి పోయినాడు. రాత్రిభోజనాలు అయినవి సవతులు ఇద్దరూ కబుర్లు చెప్పుకొంటూ తాంబూలాలు వేసుకొంటున్నారు. సురవడు యథా ప్రకారము డాబామీదికి మంచినీళ్ళు వగయిరాలు తీసుకొనిపోతూ మంగమ్మ వంక చూడనైనా ఆమె వాడితో నేత్రావధానము చేయడమూ కనిపెట్టింది. ఏమి తెలియనట్టుగా అమాయకముగా "చెల్లెలా—వారు ఊళ్ళో లేరాయెను పయిన పడుకోడము ఎందుకు నీకు జోకవచ్చినా ఒళ్లు తిప్పినా పైనుంచి నీవు కేకలు పెట్టితే మేము లేస్తామా—లేకపోతాము కాబట్టి కిందనే పడుకో"మంటూ సుబ్బమ్మ మంగమ్మ ముఖము లేరి పారచూచింది

"అక్కా నాకు ఆమంచముమీద పడుకొన్నట్టుగా ఏమంచముమీద పడుకొన్నా ఉండదు"

"అయితే ఆ మంచమే ఇక్కడికి తెప్పించేది"

"నాకు ఆ మరలుతీయడము చేతకాదు"

"చేతనయినవాండ్లే తెస్తారు" అంది ఆ మంచాన్ని అప్పటికి అప్పుడు కిందికి తెప్పించింది మంగమ్మ తీవ్రముగా ఆలోచించింది ఆమెకు భయము వేసింది ఆ క్షణమే ధైర్యము తెచ్చుకొన్నది సుబ్బమ్మ తనమీద ఆ పేక్ష చేత నే అట్లా చెప్పి ఉంటుంది అని నిశ్చయించుకొన్నది కాని ఆమె బుర్ర పరిపరివిధాలపోతూ ఉంది

"చెల్లెలా—నిద్రపోతున్నావా" అంటూ సుబ్బమ్మవచ్చింది

"లేదు" అన్నది మంగమ్మ

"ఏమిటి ఆలోచిస్తున్నావుకి"

"ఎబ్బే ఏమీ లేదు"

"ఇక రేపటినుంచి నేనే గొడ్డూ గోదా చూచుకొంటాను మీ అమ్మకు వంట ఇల్లు ఒప్పచెప్పుతాను సురవణ్ణి వంటపనిలోనుంచి తగ్గించి వేయవలెను అనుకొంటున్నాను"అన్నది సుబ్బమ్మ

"మంగమ్మ చూస్తూ ఊరుకుంది.

"చెల్లెలా ఎందుకు అట్లా చూస్తావు వాణ్ణి అవలే పంపించి వేదామా అని కూడా అనుకొంటున్నాను"

"మీ ఇష్టము"

